శ్రీరామచంద్ర.

# ప్రకృతి ప్రబంధకర్త.

దేవదేవ! మహాత్మ! త్వదీయదివ్య
భావబోధకవిశ్వప్రబంధమందు
నెచట శ్రీరామచుట్టితి? వెచటఁ జిత్త
గింపవలె నని వ్రాసి ముగించినావు?
మొదలు తుది లేని నీగ్రంథమును సతంబు
నెంతచదివిన, నెంతయూహించుకొన్న
నెవ్వ రీకావ్యమును రచియింపు మనిరో
యెవరి కీకృతి నొసఁగితో యెఱుఁగరాదు.
సుమధురమనోజ్ఞమృదుపదార్థములతోడఁ
బ్రస్ఫుటప్రౌఢరుచిరభావములతోడ
సలలితస్నిగ్ధసౌలభ్యశైలితోడ
నీప్రబంధంబు సర్వంబు నిండి యుండె
నీప్రబంధంబె సర్వమై నెగడుచుండె
నిట్టిసత్కావ్యమును రచియించునూహ
మనఘ! యెప్పుడు కలిగిన దయ్య నీకు?
ఆకసంబున నోంకార మైనయపుడొ?
విపులగతి రేఁగి వాయువుల్ వీచినపుడొ?
కీలి కీలాకలాపుఁడై కెరలినపుడొ?
ఉదకము రసోత్తరంగమై యొదవినపుడొ?
భూతపంచకమై భూమి పుట్టినపుడొ?
మింటఁ జుక్కలు మిలమిల మెఱసినపుడొ?
ధరణి జీవులు కన్నులఁ దెఱచినపుడొ?
యెపుడు మొదలిడితో తెల్పుమీ మహాత్మ.
సర్వరక్షక మంగళాశాసనముగ

నీవు తొలుదొల్త వ్రాసిన నిరుపమాన
దివ్యగీతంబు నీదయాదృష్టిఁ జేసి
యేసుకృతి ముందు గానంబు చేసినాఁడొ
యాతఁడేగద ధన్యాత్ముఁ డైనవాఁడు !
సదయ ! సచరాచరప్రపంచమున జీవ
హృదయభావప్రబోధార్థ మెల్లయెడల
నెన్ని యెన్ని రీతుల బాస లున్న యవియొ
యన్ని బాసల నలరారు నఖిలమునకు
నఖిలమును నిండియున్న నీయాదికావ్య
మహాగతిఁ బఠనీయమై యలరుచుండె.
అనఘ ! నీవచియించిన యదియె వేద;
మరయ నీవ్రాఁతలకు నెందుఁ దిరుగు లేదు;
దివ్యలేఖిని నీకు స్వాధీన మయ్యె;
గ్రంథకర్తలకును గ్రంథకర్త వీవు.
అమలతర మైన నీప్రబంధమునఁ దక్కఁ
దనుసుఖావహముగఁ జల్లఁదనముఁ గూర్చు
మలయమారుత మెచ్చోట మలయుచుండు ?
నేత్రపర్వంబుగాఁగ వెన్నెలలఁ గాయు
చందురుం డెందువాహ్యాళి సలుపుచుండు ?
శ్రుతివిమోహనముగ దివ్యరుతులఁ బల్కు
విహగసంతాన మేయెడ వెలయుచుండు ?
జిహ్వకింపగు రుచులచేఁ జెలఁగుచుండు
సరసవాహిను లెచ్చట జరగుచుండు ?
ఘ్రాణతర్పణముగను సుగంధ మొసఁగు
కుసుమవిసరంబు లేకడ నెసఁగుచుండు ?
కవులు నిన్ననుసంధించు కాంక్షఁ జేసి
కావ్యములు వ్రాయుచుండు టొక్కటియె గాని
యూహకోలఁది వర్ణించుట యొకటె కాని
ప్రకృతిమర్మంబు గ్రహియించు పాటివారె ?

ప్రకృతిమాయల కెందు లోఁబడనివారె!
ప్రకృతికెల్ల నతీతుఁ డౌ ప్రభుని నిన్నుఁ
బ్రకృతిఁ జేబంతిగాఁ బట్టు ప్రభుని నిన్ను
బ్రకృతిశాసన మొనరించు ప్రభుని నిన్నుఁ
బ్రకృతియందెల్ల నిండిన ప్రభుని నిన్ను
నూహసేయుటకేని వా రోపఁ గలరె?
వారు కవిజాతిలోఁ జేరువారె కాని
నిన్ననుసరించి వ్రాయఁగా నేర్తు మనుట
సాహసముగాదె కవిరాజచక్రవర్తి!
అనుపమం బైననీదుకావ్యంబు నిట్టు
లెట్టియోజనతో వెలయించినావొ
యెంత యోజించుకొన్న నావంత యైన
హృదయనయనంబులకు గోచరింపకుండె.
నేను దరియించు తెరు వను నియతిఁ గాని
యాత్మశక్తిని బ్రకటించు నాసఁ గాని
లోకములు మెచ్చ ననెడులోలుపతఁ గాని
నాకు యశమబ్బ ననుచింతనమునఁ గాని
యర్థసంగ్రహణాపేక్ష నంది గాని
యీమహాకావ్యమును రచియించినావె!
జగములఁ దరింపఁజేయంగఁ జాలు నీకు
నఖిలశక్తులకును మూల మైన నీకు
సకలముఁ బ్రశంస సేయంగఁ జాలు నీకు
లోక మంతట నిండి వెలుంగు నీకు
నందఁగారాని పరమార్థ మైన నీకు
నుల్లమునఁ గోరఁదగిన దే మున్నదయ్యా!
మేము నీకృతిఁ జూచుచున్నాము గాని
మేముఁ దన్మయులీల నున్నాము గాని
తెలిసినట్లుండి యేమియుఁ దెలియకుండెఁ
దెలియకుండియు నంతయుఁ దెలిసినట్లు

నటనమును జేయుచుంటి మనాథనాథ!
యెవరు నీకృతిమర్మంబు లెఱుఁగఁగలరు!
దేవ! యాద్యంతరహితమై దివ్యగతిని
భవ్యమై యొప్పునీమహాకావ్యమునకు
నీవె వ్యాఖ్యాతవై ప్రౌఢి నెఱపకున్న
నెవఁడు వ్యాఖ్యానమును రచియింపఁగలఁడు?
నీమహాకావ్యమహిమం బదేమొ కాని
పూర్వసందర్భముల పొంతఁ బోవకున్నఁ
జదువ మొదలిడ నెచటి కచ్చటికె పుట్టి
పొదలి రసభావములు పొంగి పొరలుచుండు;
నిట్టిమృదుశైలి నీకెట్లు పట్టువడెను
దేవ! యెవ్వరికేని బోధింపరాదె!
తాము వ్రాసిన దొక్కపద్యంబు నైన
నూరుఁ డోకండ్లైనఁ బఠియించు చున్నయపుడు
కవుల కెంతయానందమో కలుగునంట
విశ్వమయ! విశ్వమందు నీవిపులకావ్య
మఖిలజీవులు గూడ నిరంతరంబు
నెంతో సంతోషమునఁ బఠియించుచుండఁ
గాంచు నీకెంతయానందగరిమ కలదొ
కొలఁదివెట్టి వర్ణింపఁగాఁ గలమటయ్య!
రమ్యగుణసాంద్ర! యోకవి రాజచంద్ర!
ఎన్నిజన్మాంతరంబులో యెత్తియెత్తి
యెచట దొరకిన నచ్చటనేగ్రహించి
యిమ్మహాకావ్యములు పఠియించుచుంటి
మార! యెప్పటి కప్పుడే యభినవముగ,
నతిమనోహరముగ, సురసాశ్రయముగ,
సత్యముగ, సార్థకమ్ముగ, సమధికముగ,
సర్వజనసమ్మతమ్ముగా, సలలితముగ
ననుభవంబునకుం దోఁచు నంతెకాని

విను గొంకింతయుఁ గలుగ దీవింత యేమొ!
కొక్కొ-రోయని తొలికోడి కూసినపుడు
తొలుదెసఁ బ్రభాతకాంతులు దోఁచినపుడు
కులుకుజ్జల్గునఁ బక్షులు పలికినపుడు
తరులతాదులఁ బూవులు విరిసినపుడు
తరుణభృంగాళి మొఱయుచు నరుగునపుడు
వెడలి ప్రత్యూషపవనంబు వీచినపుడు
పూర్వరాగంబు కుంకుమఁ బూసినపుడు
చివురు లాకాంతి నైక్యంబుఁ జెందినపుడు
కూసి కోకిల కన్నెట్టి చేసినపుడు
పొడుపుఁగొండపై నెఱ్ఱప్రొద్దు పొడిచినపుడు
తరణికిరణంబు లవనికిఁ దిరిగినపుడు
మెచ్చి తామరమొగ్గలు విచ్చినపుడు
బాలభానుండు మింటిపైఁ బ్రాఁకునపుడు
జరగినకొలంది నీడలు దరియునపుడు
తలకు సూటిగ దినమణి నిలిచినపుడు
తరలి పడమటిదెసఁ బ్రొద్దు తిరిగినపుడు
నాస విడి చాయ పెడమొగ మైనయపుడు
నపరగిరి ధాతురాగంబు లలమినపుడు
నపరవారిధి మిలమిల లాడునపుడు
కనకకాంతుల నీరెండఁ గాయునపుడు
నిట్టె పవ లంతయును దుదముట్టినపుడు
మిన్ను తనభాగ్యమణి దాఁచుకొన్నయపుడు
వెలుఁగుఁ జీఁకటియును గాక వెలయునపుడు
నఖిలజగతిఁ దమోలత లలమినపుడు
పొలుపుగా మింటఁ బూవులు పూచినపుడు
నాశ లన్నియు నేకంబు లైనయపుడు
మిణుగురుంబుర్వు లెగయుచు మెఱసినపుడు
నించుమించుగ నెల యుదయించునపుడు

వెలఁదివెన్నెలకుప్పలు విరిసినపుడు
నలుదెసలు చూచి కలకల నవ్వినపుడు
కలువపూవులనెత్తావి లోలసినపుడు
దేవ ! యొక్కప్పుడా ? దినదినమునందు
గాఢనిద్రను బొందిన గడియయేమొ
కాని నిక్కంబుగాఁ గలలోనఁగూడ
నవరసాశ్రయ మగునీయనంతకావ్య
గతులు సూచుచు నానందగరిమఁ గాంచి
చదువుకొనుచుందు నొకవింత చవులుదేర.
చదివినకొలఁది మాకు నో సదయహృదయ
దినము నీమీఁది భక్తి వర్ధిల్లుచుండు.
ప్రబలగౌరవమో యనిర్వాచ్యమైన
ప్రేమయో మాహృదయవీథిఁ బెరుఁగుచుండు
నేమహాకావ్యమును బఠియించునప్పు
డామహాకావ్యకర్తపై ననుపమాన
భక్తిగౌరవప్రేమముల్ ప్రబలుచుండు;
నదిగదా యుత్తమోత్తమ మైనసుకృతి !
అట్టిమహిమంబు నీకావ్య మందె కలదు.
అట్టి రచనాప్రశస్తి నీ యందె కలదు,
కానఁ ద్రికరణశుద్ధిగా గౌరవించి
దేవ ! నీమీఁదిప్రేమ వర్ధిల్లుకొఱకుఁ
బ్రవిమలజ్ఞానసంపత్తిఁ బడయుకొఱకు
నవ్యయానందపరిపూర్తి నందుకొఱకు
నెపుడు నీకావ్యమే పఠియింతు మయ్య !
పఠన మిటు సేయఁజేయ నెప్పటికి మేము
దీని ముగియింపఁగల మయ్య ! దేవదేవ !
ఇమ్మహాకావ్యజలధిలో నెంతకాల
మీఁది యవ్వలియొడ్డున కేగఁగలము ?
ఈవలావలి యొడ్డులం దెచటికేనిఁ

గష్టపడి యెట్టులో చేరఁ గలమయేనిఁ
దీరమునఁ గూరుచుండి నీ దివ్యకావ్య
మహిమ యెంతటిదో యొక్క మాటలోనె
యింతలో నంతయును గ్రహియింపఁగలము.
కాని తొలిగాథ తెలియంగ రానిమాకు
నవల నేమున్నదో చూచు నంతకంటె
నాదిఁగాంచుటకే యాస యధికమయ్యె.
సర్వభూతదయాపర ! సాధుహృదయ !
మాయభిమతంబుఁ దీర్పవే మాననీయ ?
తావకీనమహాప్రబంధంబునందు
నాదిసింహాసనంబుపై నధిగమించి
సర్వశక్తిస్వరూపప్రసన్న మగుచు
ననుపమానాతిలోకరహస్య మగుచు
మూలకారణతత్త్వప్రబోధ మగుచు
నిర్మలానందవిజ్ఞాననిలయ మగుచు
నాదులకు నాదియైన నీ యాదిగీత
మెప్పు డుపదేశ మొనరింప నెంచినావు ?
ఎపుడు గానంబుసేయింప నెంచినావు ?
ఎపుడు మాకభిముఖముగా నెంచినావు ?
ఎపుడు పిలిచిన నోయన నెంచినావు ?
అపుడు నీవేమి బోధింతు వయ్య మాకు ?
అపుడు కోరుట కేముండు నయ్య మాకు ?
అపుడు నీవలె రచియింపఁ నగును గాదె !
అపుడు నీవంటియానంద మగును గాదె !
సచ్చిదానందమూర్తి ! విశాలకీర్తి !

వేంకటపార్వతీశ్వరకవులు.

# విస్మృతి.

మఱప! నీశక్తిఁ దెలియక మనుజు లెపుడుఁ
దిట్టుచుందురు; నిన్నొకదేవతగను
నెఱుఁగ లేకున్నవారు. నీవే యుపేక్ష
భావమున నుండువేని ప్రపంచనటన
నడువనేర్చునె నిముస మైనను? జగాన
నాప్తజనములు మృతినొందు నవసరమున
వచ్చి నీ వాదుకొననిచో, వారి కేది
శరణ? మనుగడ్గునకు నాప్తసల్లపనము
చేష్టితంబులు స్మృతిలోనఁ జెలఁగుచుండి,
కన్నులకుఁ గట్టినటు లుంటఁ గదలఁగలరె?
అట్టిస్మృతి కంతరాయమై యమరుచుండి,
ధాత సృజనకు లోపంబు దగలకుండ,
సాయ మొనరింపఁగల మహాశక్తి వీవ.
విస్మృతియోజక మగుశక్తి నిర్మితికిని
గడఁగునే లోకకర్త జగన్నియంత?
వెఱ్ఱులముగాక యాతని వెడఁ గనంగ!
నెన్ని యుపయోగములు గల వెన్న నిన్ను:
సజ్జనులు నీదుసాంగత్యసరణిని గద
యీషణాత్రయముల నెల్ల నేమఱుదురు;
చూడరానిపదార్థముల్ చూచినపుడు
ఘోరకృత్యంబులను గనుఁగొన్న యపుడు
నీదుదయ లేకయుండిన నిలుచు నెట్లు?
ప్రతినిమేషంబుఁ దలఁపునఁ బాఱి యవియె
బ్రతు కనిన రోఁతగాఁ జేసి ప్రబల కున్నె?
ఐంద్రజాలికు పింఛ మల్లాడఁగానె
దృశ్య మగువస్తు వట్టె యదృశ్య మగును;

గొన్నిఁటికి శీఘ్రవిస్మృతిఁ గూర్తు వటుల;
గొన్నిఁటికి వైపరీత్యముల్ గూర్చి మదికి
నెడఁగలుగఁజేతు; కొన్నింటి నేమఱంగఁ
గాలచక్రంబుఁ ద్రిప్పుచుఁ గడపికడపి
దూరమున కీడ్తు; క్రమముగాఁ ద్రోతు వవల;
నెంతయో యత్నమునఁ గాని యించుకంత
జ్ఞప్తి యొదవదు నీదునాజ్ఞప్తికతన.
బహుళ మగుయోజనలు మది బలసియున్నఁ
దీఁగ కమ్మచ్చునను బట్టి లాగినట్లు
నీప్రసాదమునను గాదె నిర్మలాత్మ
నొక్కటొక్కటిగనె వచ్చుచుండు వెలికిఁ?
గలిమి గలనాఁడు నీవెట్టికళల నున్న
నాపదలవేళ దయచేయు మమ్మ! నీవు;
ఆపదలు కాఁపురముసేయ ననవరతము;
నాపదల కడ్డుపడువారె యాప్తు లమ్మ!
కోరి సేవలు సేయించుకొనినఁ గాని
కరుణఁ గొందఱు గనరు సాక్షాత్కరింప
రట్టిదానవె; కొలువ ని న్నదియె పనిగ
వికృతఫల మిత్తు విది నీకు విహితగుణము;
కోరి నీదాయ స్మృతిని లోఁగొనఁగవచ్చు;
నీకు దయరావలెనె గాని ని న్నొకండు
వశ్య మొనరించుకొనఁగలనాఁడు గలఁడె?
ఆశ్రితుం డనాశ్రితుఁ డనునట్టిభేద
మింతయును లేదు నీకడ నెల్లరకును
నార్తిగలవేళలఁ బ్రసన్న మగుదు వీవు.
కోరఁబోమమ్మ యెపుడు మాకూడ నుండఁ
గలిమి గలవేళ నెందఱేఁ గనఁబడుదురు;
వారిఁ జూడక నీసేవ వఱలుచున్న
నింద సేతురు నన్నును నిన్నుఁ గూడ;

నినుమనుగుడించి గాదె వహ్నికినిగూడఁ
గలుగు సమ్మెట్లవేటు లకారణముగ.
చదువు సంధ్యలవేళ నాసరణి రాక,
కలిమి గలవేళ నావంకఁ గనఁగఁబోక,
యున్నవారల నేఁ జూడ నెల్ల ననుచు,
నలుక వహియింపకమ్మ! యోయమ్మ! నీవు,
కొడుకు చేసినత ప్పెన్నుకొనునె తల్లి?
యదను గనిపెట్టి బిడ్డల నరయుఁ గాని;
తప్పుఁ గనఁబోరు సజ్జను లొప్పుగాని
వలదనిననాఁడె వారు కావలెనె నీకు!
నిన్ను సేవించి వాంఛించుచున్ననాఁడె
తేర్పర మ్మాపదలఁ గడతేర్చి పొమ్ము
స్వస్తి యగు నమ్మ! నీకు సౌభాగ్య మమ్మ!

తల్లాప్రగడ సూర్యనారాయణరావు.

శ్రీ

# రాయవాచకము.

( ఈగ్రంథము తాటియాకుప్రతులు రెండు పుదుకోటలో దొరకినవి. అందొకటి సంపూర్ణముగను మఱియొకటి యసంపూర్ణముగను నున్నవి. రెంటి నిబరిశీలించి పాఠమును నిర్ణయించుటయైనది. భాష తఱచుగా లక్షణవిరుద్ధమయి నను జరిత్రాంశములే ప్రధానముచేసియు దక్షిణదేశమం దానాఁడు వ్యాపించి యున్న వ్యావహారికాంధ్రభాషాస్వరూపము లోకమునకుఁ దెలియుట మంచి దనియు వాక్యరచన మున్నది యున్నట్లే ప్రకటించుచున్నారము. శీఘ్రముగనే యీగ్రంథము టిప్పణముతోఁ బుస్తకరూపముగఁ బ్రకటింపఁ దలఁచినారము.)

## అవతారిక.

క. విజయనగరవృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకుఁ దేటపడంగా
సృజియించితిఁ గృష్ణరాయశేఖరుచరితల్. ౧

క. విజయనగరజనపాలుఁడు
విజయాపురి గోలకొండ వీరులతోడన్
గజపతిని నాజిగెలిచిన
విజయుండా కృష్ణరాయవీరునిచరితల్. ౨

క. రాయలను రాజనీతులు
నాయుఁడు నప్పాజి చెప్పినవి యన్నియుఁదాఁ
బాయక మనసున నునిచిన
రాయసములు వ్రాయఁ జదువ రసికత గలుగున్. 3

క. బాలురు చదివిన బుద్ధివి
శాలురు గావలయు శాస్త్రజాలంబులలో
లోలురు నరివధచింతా
శీలురు గావలయు భక్తిశీలత నెప్పుడున్. ౪

## కథా ప్రారంభము.

శ్రీవంతు సకలగుణసంపన్నులయిన మహామేరుసమానధీరులైన అఖండితలక్ష్మీప్రసన్నులయిన శ్రీమన్మహామండలేశ్వర రాజమాన్య మహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథనాయనయ్యవారి దివ్యశ్రీపాదపద్మములకు దేవరవారి స్థానాధిపతి భక్తపరాధీనుండు సద్వినయ భయభక్తులనున్ను శాయంగల విన్నపం.

కర్ణాటరాజుల దినచర్య.

విద్యానగరమందు వీరనృసింహరాయలవారు బ్రాహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యులు నామావళులున్ను అధ్యాత్మసంకీర్తనములున్ను పాండవగీతలు భ్రమరగీతలు గజేంద్రమోక్షు భారతసావిత్రిదధివామనస్తోత్రము గంగావతరణము నదీప్రార్థనమున్ను భారత భాగవత రామాయణం ముచికుంద స్తుతి అక్రూర స్తుతి భీష్మస్తుతి సంజ్ఞయునీతి విదురనీతి చాణూరనీతిపద్యనీతి ఇవి మొదలైనవిన్ని నీతివైరాగ్యశతకం పురాణశ్రవణమున్ను రాజనీతులన్నియు విని దర్పణావలోకనాంతరంకన్యకామణులు కపిలకామధేనువను స్పర్శనంబుచేసి విప్రవరుల దర్శనంబుచేసిన పిమ్మట దంతధావన ముఖమజ్జన నామతీర్థమై విభూతి ధరియించి పేరోలగంబై కూర్చుండగా నూటయెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థప్రసాదములున్ను రాగా యెదురుకొని ప్రత్యుద్ధానముచేశి అంజలిచేనందుకొని శిరసావహించి స్థలాంతరాలనుంచ్చిన్ని వచ్చిన అయ్యంగార్లనున్ను ఆరాధ్యులవారలనున్ను వుచితాసనములయందు కూర్చుండనియమించి అష్ట స్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలంసాలగ్రామంతోతాద్రి నైమిశారణ్యాం పుష్కరక్షేత్రం ఇవి మొదలయినస్థలాలకు సురక్షితము గలవా అని అడిగినందులకు దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయాస్థలాంతరములనున్ను ముద్రకర్త స్రుఖటికొకటి కొదువలేకుండ నడుపుతూ వున్నారు నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తావున్నవి అని అయ్యంగార్లున్ను పలకగా, పృథివ్యాప స్తేజో వాయు రాకాశ కాత్మకమైన యేకామ్రనాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదంబరం మొదలైన డెబ్బైరెండు దేవస్థలాలున్ను పదునెనిమిది శక్తులున్ను నిండు పడితరములుగలిగి నిత్యోత్సవములు గలిగియున్నదనేటట్టుగా ఆరాధ్యులు దెలుపంగా, విన్నవాడై చాలసంతోషపడి వార్లకు పట్టెములమర్చి ధర్మాసనం ధర్మయ్యను పిలువనంపంగా ఆయన వచ్చి నిలచి దేవరవారు ఆనతిచ్చినప్రకారం ద్రావిడ

రాజ్యములోగల అగ్రహారములున్ను ఆంధ్రదేశం హాయనదేశం మొరసునాడు మొల్నాడు కర్నాటకం ఘుట్టశీను చేర చోళ పాండ్య మగధ మళయాళ ఆదిగాగల అగ్రహారములకున్ను అవధి ఆటంకములులేక నిత్యకర్మానుష్ఠానపరులై ఋగ్యజుస్సామాథర్వణపారీణులయి షట్శాస్త్రపారీణులయి పంచయజ్ఞపరాయణులై అతిథి సంతర్పణలు చేసుకొని నిర్విచారులై సుఖవసతిగావున్నారని విన్నపంశాయగా, రాయలవారు వినవధరించి దళనాయకుల పిలువనంపగా, వారు వచ్చి పొడగని నిలిచి వినయముతోడట్లు సింహాసనరాజ్యములోగల గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గములయందు కావలికట్లు ప్రహరిబడగరములున్ను బీగముద్రలు స్వామివారిప్రతాపమువల్ల జతనమై యున్నవి, సామంతరాచకార్యములు విశేషముగా లేదు అని విన్నపంశాయంగా; ఆవెంబడిగా తలారి జంగమయ్య వచ్చి రాయలవారి సముఖానకు అడ్డబడి చేతులుకట్టుకొని నిలిచి దళనాయకులతోను విద్యానగరపట్టణములోనున్న వెలిపాళ్యములయందున్న యాదిహెచ్చరికలు గలిగి రాత్రిపగల్లు తలార్లు జతనమై జాగ్రతగా కాస్తావున్నారు; గనక పట్టణములోగల అష్టాదశవర్ణాల వారును అత్యంతసంతోషపరులై అతివైభవములతోడట్లు నిత్యకల్యాణములున్ను పచ్చతోరణములున్ను గల్గియున్నారని విన్నపంశాయంగా, దళనాయకులువిని రాయలవారికి విన్నపంజేశినారు. ఆపిమ్మట విఠలవిరూపాక్షస్వామి ధ్వజారోహణమైవున్నది రథోత్సవానకు విజయం శాయవలెను అనివిన్నపంశాయంగ దగ్గరవున్న దళనాయకులు ఆతీరున్నె రాయలవారు విచ్చేస్తావున్నారు స్వామి రథారూఢులైన తోడులోనెవచ్చి విన్నపం శాయమని అంప్పించి రాయలనగరికి తొమ్మిది సంప్రతులనున్ను బిలువనంపగా కరణాలువచ్చి పదునెనిమిది శేవుల లెక్కలున్ను వినుపించిన తర్వాత రాయలవారు దిక్కులనుంచి వచ్చిన కమ్మకాకితములు యేకాంతముగా వినుపించ్చగా విని ప్రధానులను దళవాయిని రప్పించ్చక కొంతతడవు యేకాంతముగా ఆలోచించి ఆపిమ్మట నిండు కొలువునకు వచ్చినవారై సకలసామాజికులను రప్పించక నగరిఅల్లుళ్ళుకొమాళ్ళు దొరమన్నీలు ప్రభువులు పాళెగార్లు అమరనాయకులు పురోహితులు ఆచార్యపురుషులు జియ్యంగార్లు యతీశ్వరులు దైవజ్ఞులు నాటకాలంకారులు విద్వాంసులు వీణాధరులు చేరువగార్లు రాజులు వందివైతాళికులు పాటకులు పౌరాణికులు శాస్త్రిలు ఇవి మొదలుగాంగల డెబ్బెరెండు వినియోగాలవారలున్ను వచ్చి

కొలువుండగా దైవజ్ఞులు లక్షణీకులు దళనాయకులతోను ఆగతానాగత భూత భవిష్యద్వర్తమానంబులు ప్రసంగన శాయగా ఆవెంబడిని విద్యానగరపట్ణాం గ్గాంవిచ్చేటందుకు మునుపు విద్యారణ్య శ్రీపాదులు యెందుండిరి వారు ఇచ్చటికి రాకారణాంయేమి వారువచ్చి పట్టణాం గావించినది యేట్లు అని అడిగినందులకు ముల్లంద్రడిండిమపుంభావసరస్వతి విద్యారణ్యుల వచనాలున్ను విజ్ఞానేశ్వరమున వచనాలున్ను ఆయనకు తెలిశివుండును. పుంభావ

విద్యారణ్య ప్రశంస.

సరస్వతి విన్నపం జేశినవివరం; మూకాంబికయందుజ్ఞానేంద్రసరస్వతులు విద్యారణ్యులను ఆశ్రమస్వీకారమిచ్చిజ్ఞానోపదేశం జేశి సన్యాసాశ్రమమునకు సమకాన్తలోష్టుండై కామ క్రోధములు కట్టిబెట్టి మదమాత్సర్యములు విడిచిశత్రువులమిత్రువులుగాజూచి తిట్టినవారల దీవించినవారలుగాయెంచి భూమియె పల్యంకముగా శయనించి భిక్షాన్నమె అమృతాన్నమని తృప్తుండై కాషాయవస్త్రిములుగట్టి నియతబ్రంహ్మధ్యాననిపుణతను ఏకాంగుండై మౌనముతోడట్టుగా గ్రామైకరాత్రముగా చరింపమని ఉపదేశించిన ప్రకారానకు చలించక సంచరింపంగా పురాతన పుణ్యాంవల్ల యేవ్వూర యేయింటికి పోయినా మృష్టాన్న భిక్షము బెట్టుదురు. ఆయన్నము దెచ్చి గురువులయిన జ్ఞానేంద్రసరస్వతులవారి సన్నిధానమున వుంచగాను వారుచూచి సన్యాసులకు భిక్షాన్నము అర్హమింతే గాని మృష్టాన్నముయోగ్యముగాదు అట్టిపట్ల రాజయోగమైన అన్నము దేవచ్చునా అని కోపగించుకోంగా విద్యారణ్యులు యీశరీరానకు కావలెనని యిచ్చచేతను అడిగినవాడనుగాను యేవ్వూరయేయింటికి పోయినా యీరీతిని భిక్ష పెట్టుతూవున్నారు యీప్రారబ్ధానకు ఏమి శేతును అనివిన్నపం శాయంగా, జ్ఞానేంద్రులవారు విద్యారణ్యుల పరిశోధింపవలశి తమశిష్యులను వెంబడిపంపగా, వారు విద్యారణ్యుల వెంబడినిపోయి అక్కడక్కడ పంచభక్షపరమాన్నములతోడట్టు భిక్షంబెట్టుటను గని వచ్చి గురువులయిన జ్ఞానేంద్రులవారితో యీవివరం పలకరించగా వారు యితని పురాతన పుణ్యఫలము తప్పింపరాదు ప్రారబ్ధం అనుభవించక తీరదు అని మనస్సున యెంచి యయినా భాగీరథీయాత్ర జేశి అందువాసముగావుండి జీవన్ముక్తుండవగుమని ఆనతిచ్చి అంపంగా అనుజ్ఞాతుండై విద్యారణ్యులు భూప్రదక్షిణముగా విరాట్పురందాటి వరాసదేశానకు పోంగా ఆదిపర్వతం సమీప వరహానదీతీరాన అశ్వద్ధవృక్షమందు ఋగ్యజుస్సామాధర్వణ పారీణతజేసుక బ్రాహ్మణుండు ఏకదేశాన వానప్రస్థుండై వుండ

గాను ఆయనను చేరబోయి విద్యారణ్యులవారు ఆ బ్రాహ్మణుని పూర్వోత్తరము
లున్ను గోత్రనామములున్ను అడుగగా ఆ బ్రాహ్మణుడు సత్యవచనుండు గనక
తనపేరు శింగ్గిరిభట్లందురు రఘునాయకులు రాజ్యపరిపాలనం జేశేదినాలు
దశాశ్వమేధ షోడశ దానములున్ను శాయంగా తులాపురుషదానమునకు
యెవ్వరున్ను పూనేవారు లేరు గనక అందువల్ల యాగఫలితం శేయమని రఘు
నాయకులు మాతో పలకరించగా ఆయనకొరకై తులాపురుషదానానకు
ఆచార్యత్వముగా నన్ను నియమించిరి గనక వారిచేత ప్రతిగ్రహాలబ్ధుండైన
దారభ్యం యీఅశ్వద్ధవనమందువాసము వుందును తనకు ఆగత అనాగత
భూత భవిష్యద్వర్తమానంబులు అన్నియు తెలుసును అదెట్లంటేను మీరు
జ్ఞానేంద్రులవారిశిష్యులు మీనామధేయం విద్యారణ్యులు మిమ్ము భాగీరథీ
స్నానముచేశి అందువాసమువుండి అచ్చట జీవన్ముక్తుండవగుమని నియమించి
అంప్పించినారు గనక మీరు ఆదిక్కునఉండతగ్గది లేదు కాశిలో వేదవ్యాసుల
దర్శనమున్ను అన్నపూర్ణ విశాలాక్షి విశ్వేశ్వరుల దర్శనమున్ను కలిగి
వారి అనుగ్రహామువల్ల తిరుగా పంపానదీ తీరానకువచ్చి పెంపుగా ఒఖపట్ణం
గావించి హరిహారులపేరిట వార్లను పట్టముగట్టి ఇష్టసంపదలతోడట్టు మో
దంబునవుండేటందుకు శింగ్గిరిభట్లు ఆగతం జెప్పినందులకు, విద్యారణ్యులు
శింగ్గిరిభట్లను బ్రహ్మరక్షుస్సుగాయెంచి భీతిలేక ప్రత్యుత్తరమియ్యగాదలచి
వ్యాసులు మనుష్యులకుగోచరము కానేరరే వారిదరిశనం యేరీతున గలిగీని
అని అడిగినందులకు వ్యాసులు మీదృష్టి పదమయ్యేటట్టు చేశేను నేచెప్పి
నట్టునడిస్తిరాయనా యభీష్టకార్యములున్ను నెరవేర్చుదును, మీకన్నికార్య
సాధనములుకలిగీని అని పలుకరించె. గనక ఆతీరునె మీయభీష్టకార్యములు నెర
వేర్చేము అని పలుకరించినందులకు సింగ్గిరిభట్లు పలికే ప్రకారం అయితె మీకు
కరతలామలకముగ దెలిపేను అని పలుకరించగా విద్యారణ్యులు చాలాసంతో
షపడి వేదవ్యాసులదర్శనానకు హేతువు పలకరించమనగా శింగ్గిరిభట్లు పలికే
ప్రకారం మేము పలకరించేము వార్తలువిని కాశికిబోయి మావద్దికివస్తేను అన్ని
కార్యములున్ను చెప్పేను మీరు కాశికిబోయిన సమయాన వేదవ్యాసులు
కావడికుండలతో మధువుంన్ను భుజానవుంచుకొని తోలుకుక్లాయీని బిల్లచెప్పు
లున్ను నీలిధట్టిన్ని వుభయపార్శ్వముల చతుర్వేదసమానములైన నాలుగుశున
కములుగూడి రాగా నికృష్టమయిన రూపము తోడట్టు మధ్యాహ్నకాలమందు

గంగాతీరానకువచ్చి కావడి గట్టునందించ్చి మణికర్ణికలోనస్నానముజేసి గట్టుకు వచ్చి గోదోహనమాత్రం వెలపటవచ్చి నిలిచివుండురుగనక ఆసమయానమీరు సంకోచపడక అచ్చటికి బోయి వారి పాదముల ఘట్టిగా పట్టుకొని వందనం చేస్తేను నావంటిహీనుల మీవంటియతీశ్వరులు యీరీతున వందనములు శేతురా అని హీనకులాచారపుమాటలు యెన్నివిధములుగ పలకరించగా పాదములు విడువక పట్టుకుంటే అప్పుడు వారికి దయవచ్చి అనుగ్రహించేరు అనిచెప్పంగా విద్యారణ్యులువిని అందుండి కాశికిపోయి మణికర్ణికా ఘట్టమున కాచియుండగా ఆలాగె మధ్యాహ్నకాలమందు శింగ్గిరిభట్లు తెలిపినప్రకారం వేషము వేసుకొని వచ్చే వేదవ్యాసులగనుగొని సాష్టాంగనమస్కారముజేసి రెండు పాదములును కన్నులనొత్తుక భక్తియై నిలిచిన సన్యాసినిజూచి యీతండు మాస్వరూపం తెలిశినది యెట్లు అని జ్ఞానదృష్టినిజూచి విద్యారణ్యులతోను మీరు శింగిరిభట్లుదెలుపగా గదా మాస్వరూపం యెరిగితిరి అయితె మంచిదాయెను శింగిరిభట్లు బహుకాలము మాకుస్నేహమైవుండును ఆయునకునిద్రాహారములేక అశ్వద్ధవనమందు చాలా అవధపడుచు వుండును నిన్నుంచి కర్నాటకాన వఖ నగరం కావలసియున్నది అందు మున్నూట అరవై యేండ్లు లక్ష్మీకటాక్షం గలిగివుండును ఆపట్టణం వున్ననాళ్లకు ఆ సింహాసనస్థునితో దెలిపి శింగిరిభట్లుకు ప్రీతిగా నిత్యకృత్యమున్ను పంచభక్షపరమాన్నముతోడట్టు మృష్టాన్నం సహస్ర బ్రాంహ్మణభోజనం చేయించవలెను అని ఆనరపతితో బలికి ఆనగరమందు ముప్పైన్నృపతులు కీర్తి ఖ్యాతులుగల్గి నడువకారణమున్ను అని పలకరించి కొన్ని మంత్రరహస్యములున్ను విద్యారణ్యుల కనుగ్రహించి వేదవ్యాసులు అదృశ్యులయిపోగాను; విద్యారణ్యుండానందభరితుండై భాగీరథిలో స్నానముచేశి కాశీ విశ్వనాథులనున్ను విశాలాక్షినిన్ని దర్శించి గయా ప్రయాగములనున్ను దర్శనస్నానముల జేసి ప్రయాణగతుండై శింగిరిభట్లు వున్నతావునకువచ్చి తాము కాశికి పోయిన పూర్వోత్తరములున్ను వేదవ్యాసులు ఆనతిచ్చిన వృత్తాంతములున్ను శింగిరిభట్లకు చెలుపంగ శింగిరిభట్లు సంతోషపడి విద్యారణ్యులతోను లక్ష్మీకటాక్షమువల్ల వఖ పురంగావించి అందున రాజుల ప్రతిష్ఠ చేస్తేను ఆపురానకు ఆయన

**విద్యానగర నిర్మాణము.**

వచ్చి ఆయువనీపతులకు మేలొనగూర్చి కీడుపరిహరించుకొంచున్నువుండెను. అచ్చట తనకు ప్రీతిగా నిరంతరమున్ను ఆనగరమందు అవ్వారిగ సత్రములున్ను దివ్యతిరుపతులున్ను పంచభూతాత్మక

మైన శివస్థలాలయందున్ను గంగా, యమునా, సరస్వతీ, గోదావరీ,సింధు నర్మదా
కావేరి తామ్రపర్ణి మొదలయిన మహానదీతీరాలనున్ను నిరంతరం అవ్వారిగ
రేయిపగలు అన్నదానములు జేశేటట్టు కట్టడశాయమని మనవిజేశుక విద్యా
రణ్యులును శింగిరిభట్లుంతో తాము విద్యానగరానకువచ్చి అందుండి రాయల
వారికి అహర్నిశమున్ను తాము ఆశీర్వాదము చేసుకఉండవలెను అని పలికి
అంపించుకొని విద్యారణ్యులు ఉత్తరదేశాన కాశ్మీరఖండమందు మండలమి
శ్రులవద్దను సకలశాస్త్రములున్ను నేర్చి చింతామణి మంత్రోపదేశముచేత లక్ష్మీ
దేవిని ప్రార్థన శేయగా, ఆయిందిరాదేవి ప్రత్యక్షమై నీకు కావలయు వరముల
డుగుమని ఆనతియియ్యగా, విద్యారణ్యులు తన పేర వొక పట్టణంగావించవలసి
వున్నది మీరు అక్కడ యెన్నాళ్లు వాసముగా వుందురో అన్నాళ్లు ఆపట్టణ
ములోగలప్రజలు అందరున్ను సుఖస్థితివుండవలెను, అందు నుంచిన్ని తనపేరు
కీర్తి శాశ్వతముగా నిలుచును; భూలోకమందు ఎవనిపేరయిన యెన్నాళ్ళు
వెలయుతావున్నదో అన్నాళ్ళున్ను ప్రజలకు స్వర్గాది భోగములున్ను ఐశ్వర్య
ప్రదమున్ను పుత్రపౌత్రాభివృద్ధిగలిగివుండును గనక తాము గావించేపట్టణ
మందు మీరు శాశ్వతముగ వుండేటట్టు ఆనతీయవలెను అని ప్రార్థనశాయంగా,
ఆమహాదేవి మీమనస్సుప్రకారం వచ్చి వుండేమని అనుగ్రహించి, నీవు మమ్ము
తిరిగి జూడక పొమ్ము నీ వెంబడిగా వస్తావున్నారమని ఆనతిచ్చి పంపగా, కాశ్మీర
దేశాననుండి వుజ్జయనికివచ్చి కొల్లాపురమందుండి కిష్కింధకురాగా, విద్యార
ణ్యులు తుంగభద్రలో స్నానముచేసి పంపానదీతీరానకువచ్చి పంపావిరూపా
క్షుని సేవించి మతంగపర్వతమెక్కి పట్ణం గావించేటందుకు చతురశ్రమమైన
భూమిని నాలుగుదిక్కులు చూడగా, ఆ సమీపాన గోవులమందలో నున్న శున
కాన్ని పర్వతగుహాలోనున్నకుందేలు తరుమగా విద్యారణ్యులు చూచి ఆశ్చర్య
పడి, లోకములో శునకం కుందేటికి తరిమేదిగాని కుందేలు శునకాన్ని తరిమేది
యెక్కడా చూడము యీస్థలమహిమ యేమోయని ఆదిక్కులనున్న పిన్నపె
ద్దల పిలువనంపించి అడుగగా వారుచెప్పునది; యీయొక్క స్థలమహాత్మ్యము
యెంతబలవంతులుగావున్నాను మతంగమహామునులవారి శాపమువల్ల దుర్బలుల
హింసించ కూడదు అనిచెప్పి వున్నారు. పూర్వమందు కిష్కింధలో వాలిసుగ్రీవు
లుందురు. వారుతమలోతాము కలహించుకొని యుద్ధముజేశి ఆయొక్క యుద్ధంబు
శేయుసమయాన మహాబలుండు వాలి గనక సుగ్రీవుడు వాలితో యెదిరించి

యుద్ధము సేయలేక పారివచ్చి యీ మతంగ పర్వతముమీదవుండును. వాలి వెంటాడి రాగా పూర్వమందువాలిని యీకొండ యెక్కకుండ మతంగమహాముని శాపమిచ్చినారుగనక ఆదారభ్యం బలవంతులైన జంతువులైన మనుష్యులయిన ఆదిక్కు బలవంతవుపని శేయబడదు. అని చెప్పినారు ఆలాగున అది మొద లుగా సుగ్రీవుడు వాలితో యుద్ధము శేయకూడక యీమతంగ పర్వతానకు వచ్చును. కాబట్టి యీస్థలానకు ఎంతబలవంతుడువచ్చినా నిర్వాహకశక్తి లేక పారిపోవునుగాని యెదిరించి నిలువలేడు అని యేమో యీస్థలానవుండే జంతువు లయినగాని మనుష్యులైనగాని అరిజనులకు అసాధ్యమనిచెప్పగా, విద్యారణ్యులు ఆశ్చర్యపడి, ఇది మునీశ్వరులమహిమగలతావని చాలామెంచి యీదిక్కున పట్ట ణముగావించవలెను అని నిశ్చయించి అశ్వపతి గజపతి నరపతులలో నరపతియే ఘనము గనక నరపతిరాజ్యానకు పరోపకారముగ పురం గావించవలెనని యె న్నటికిన్ని చలనంలేకుండ వుండేటట్టు మంచిముహూర్తాన శంకుస్థాపనంజేశి వాస్తుపురుషునికి నిలిపి నగరికి స్థలం యేర్పఱచి నగరు దేవళమున్ను కోటకొ త్తళములున్ను నవద్వారములున్ను ఏర్పఱచి వాస్తువులుదీర్చి వీథులుయేర్పాటు చేయవలెనని తమతో కూడావిద్యాభ్యాసముచేసిన చతుర్వేద శంకరాబ్ధికుండైన

శంకుస్థాపనము హూర్తము. శిశ్యుని వెంబడిగాకూర్చుకొని నిశ్చయించి, యప్పుడు శాలి వాహన శకాబ్దంబులు లెక్క ౧౧౨౫ యేండ్లు వెయ్యిం న్నూటయిరువైయైదేండ్లమీద చెల్లే ప్రభవనామసంవత్సరం చైత్ర శుద్ధ పౌ ర్ణమి స్థిరవారము శుభయోగ శుభకరణములుగూడిన శుభముహూర్తముల యందు ముహూర్తంజేశి, కృష్ణపక్షం అమావాస్యనాటిరాత్రి నిశిసమయమందు శంఖుస్థాపన జేశేటందుకు శాస్త్రజ్ఞులనున్ను మంత్రాధికులనున్ను దైవజ్ఞుల నున్ను గూర్చుక ఉత్తరదక్షిణాలు యేర్పాటుకు త్రిశంకు ధ్రువులనున్ను, చూచి త్రిపురుషించి శంఖుస్థాపనముజేశి, తూర్పుపడమరలకున్ను త్రిపురుషించి శంక్కు వులు స్థాపించి వాస్తుపురుషుని షోడషమణువులు బంగారునచేయించి చేవకంభ మున ప్రతిష్టించి, ఆ స్తంభము శిరస్సు స్థానానకు జలాంతరముగాత్రవ్వి, సుము హూర్తమందు మేము శంఖనాదముచేసినారము ఆసమయమందు స్థాపించమనే టట్టుగా శిశ్యులతో పలకరించి, అంపించి లగ్నము తప్పకుండ నిరీక్షించికొని వుండగా, అసమయమందు వొక్కజంగమువాడు భిక్షాటనమునకువచ్చి శంఖనా ధముచేయంగావిని గురువులవారు శంఖంపూరించినారనేటట్టుగా యెంచి వాస్తు

పురుషుని నిక్షేపించిరి గనక వెంబడినె ఆగురువులవారున్ను శంఖనాదముచేశినది విని రెండోతేప శంఖం పూరించినది యేమోయని సిద్ధేశగురువులవారి వద్దికి వచ్చి శిష్యులు ఆడిగినందులకు, లగ్నంతప్పిస్థాపిస్తిరో అని జ్ఞానదృష్టిజూచి జంగమువాడు శంఖనాదముచేసేటట్టుగాఁదెలిసి చలనము వచ్చెనని విద్యారణ్యులు జూచి చాలాకస్తిబడి, యిప్పుడు జేసినదోషమువల్ల మూడువేలున్ను అర్వారేండ్లకు ఖ్యాతిగలిగి వుండవలెనని యత్నముజేశినందులకు మున్నూటఅరవైయేండ్లుగానిలిచెను వ్యాసులవాక్యం తప్పక నిలిచెను అనియెంచి వాస్తుపురుషుని స్థాపించినారుగనక ఆదారభ్యం యీవరకు యిరవైతొమ్మిది నృపతులకున్నూరు యేండ్లాయెను. ఇంక అరువైయేండ్లు పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచియుండును.

**కృష్ణరాయలపట్టాభిషేకము.**

అనివిన్నపంజేశి యీరాష్ట్రపట్టం కృష్ణరాయలవారికి కట్టవలెను అని దళనాయకులతో పలుకరించి, కృష్ణరాయలవారు తాము పెద్దలనైతిమి తమ మర్యాదాగా రాజ్యపరిపాలనం జేశేటందులకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తలు చేయమని మంచివేళజూచి ముద్దుటుంగరమిచ్చినారు గనక దళనాయకులు అయ్యమరసు కొండమరుసు బాచరసు యల్లమరసు వీరమరసు అప్పాజి లక్షణధణియక యెల్లన్నదళనాయకులు అప్పరపిళ్లె మన్నారుపిళ్లె రాయసంరామచందయ్య బొక్కసంభాస్కరయ్య అవసరంవెంకటయ్య త్రియంబకయ్య లక్ష్మీపతి ప్రధాని తిప్పరుసు దళవాయి లింగరసు ఆర్వీటిబుక్కరాజు సాళువమేకరాజు శ్రీపతివారు బూదహాల్లీవారు నంద్యాలవారు అవుకువారు తొరగెంటివారు రాచూరితిమ్మరాజు సంగరాజు వెలుగోటివారు పెద్దసానిఅక్కప్పనాయుడు కరకమ్మదొరలు తుళువదొరలు మొదలయినవారలందరున్ను, నగరివిద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషాకవిత కృష్ణావధానులు శాబ్దికంపాండిత్యం వెంకటరామశాస్త్రుర్లు సహస్రావధాని ప్రభాకరశాస్త్రుర్లు జోస్యులు కవీశ్వరులు మరిన్ని గలిగిన పిన్నపెద్దలు అందరున్ను శాస్త్రోక్తముగ శుభముహూర్తమందలి కృష్ణరాయలవారికి మంగళస్నానం చేయించి, కళ్యాణవేదికయందుబంగారుపీఠమున కూర్చుండనియమించి, దశదానములు షోడశమహాదానములున్ను చేయించి స్వర్ణతుల రజితతుల రత్నతుల మౌక్తికతుల మెరవులు కోటిగోదానాలు సహస్రకుటుంబప్రతిష్ఠలు మొదలైన దానధర్మములు చేయించి, చతుస్సముద్రములనుంచిన్ని బంగారుకలశములతో వుదకములు తీసుకొనిరాఁగా, గంగా యమునా సరస్వతీగోదావరి నర్మదాసింధు

కావేరితామ్రపర్ణి మొదలయినమహానదుల వుదకములున్ను అష్టాదశ వాద్యఘోషములున్ను మ్రోయగా, సుముహూర్తమందు బ్రాహ్మలచేత మంత్రోక్తముగ అభిషేకముచేయించి, ఆపిమ్మట కనకాభిషేకం నవరత్నాభిషేకం చలువల తల్లోత్తి, పీతాంబరం ధరియించి, చందన అగరు కస్తూరి గంధాదులధరియించి, వారలనందరిని విడిదీలకంపించి, ఆపిమ్మట అల్లుండ్లు కుమాళ్లు బంధుపరిజనులున్ను స్నేహితులను పంక్తిని బెట్టుక ప్రసాపడి, సుగంధజలముల హస్తప్రక్షాళనముచేసి, ఆచమనీయ్యంజేసి, గిలుకుపావాలుమెట్టి, సంక్షేపరామాయణము చదువుతాను, శతపదాలు నడిచి, రత్నకంబలిమీద కూర్చుండుకొని, అప్పాజి మొదలైనవార్లనున్ను దళనాయకులనున్ను ప్రధానులనున్ను పిలువనంపించి, వారలతోను కృష్ణరాయలవారు ఆనతిచ్చినది:—

వీరనరసింహరాయలవారు సింహాసన పరభారకం వహించి నడిపించిన దారభ్యం యీవరకు అచ్యుతరాయలు చంద్రమౌళిన్ని మేమున్ను కూర్చుండక వుంటిమి, యిప్పుడు మమ్మున రాజ్యపరభారకం వహించుమన్నారు గనక సింహాసనస్థులు నడిచేదేరీతు, శత్రువులజయించేదేరీతు, మిత్రులపోషించెదేరీతు, ఆప్తజనులపాలించేదేరీతు, కొలిచిన వారినిఆదరించేదేరీతు, ఆత్మసంరక్షణమున కర్హులయినవారెవ్వరు, అర్ధచింతవుపాయం అర్ధవ్యయం సకలమున్ను తెలిశే దేరీతు, శాశ్వతమైనకీర్తిఖ్యాతులు గలిగేదేరీతు. ఇవి మొదలైన రాజనీతులన్నియు తాముదెలిశినవారుగదా మాకులెస్సగా తెలియ జెప్పవలె నని ఆనతిచ్చినందులకు, అప్పాజి అమ్మయరసు కొండమరసు వాచరసు మొదలైనవారు నలుగురున్ను స్వామివారు ఆనతిచ్చినది నీతికార్యమెసరి, సకలనీతులున్ను విచక్షణములున్ను కార్యనిర్వాహములున్ను సామర్థ్యమున్ను మయ్యేది సామాజనులతో ఆలోచనంజేశి సకలరాజ్యసారములున్ను రాయలదేవునితో రాజనీతులు విన్నపంజేశినది.

కృష్ణరాయనికి మంత్రులు రాజనీతియుపదేశించుట.

సింహాసనాధిపతి అనంగా విష్ణుఅంశగాని యితరం గాదు. అది యేలాగంటేను "నరాణాంచ నరాధిప" మని భగవద్వాక్యం ఉన్నది.

అందుకునీతిపద్యం కం. తరుణుండై నవరత్నా
భరణుండై గంధపుష్పపరిమళయుతుఁడై
నరనాయకపరివృతుఁడై
పరఁగినవాఁడమరు నిటసభాపతియనఁగన్॥

క. శ్రీరమ్యుఁడు విజయుఁడును
ధీరోదాత్తుఁడు సుగుణతేజోనిధియై
యీరయ సింహాసనమున
నారూఢుం డగుట యొప్పు నాసభనడుమన్॥

ఇట్లు సింహాసనస్థుండు స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలంబులను రాజసప్తాంగంబుల దెలిసి ఆందోలికా అంబర ఆభరణ వాహన రాజసన్మాన కర్పూర తాంబూలంబులను ఉచిత సప్తాంగంబులను రాశి యెరుగవలయు. సామ భేద దాన దండమాయోపాయ ఉపేక్షను హేంద్రజాలంబులు సప్తోపాయంబులు తెలియవలయు. రాజులకు సప్తవ్యసనంబులు గలవు. అందులకు నీతిపద్యము.

గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁ బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

అవియవి యెట్లంటేను:—వెలది స్త్రీవ్యసనము, జూదము జూదమాడుట, పానము సురాపానము చేయుట. వేటపోవుట. పలుకుల ప్రల్లదము తిట్టుట. అకారణం దండించుట. అనుచితం వెచ్చబెట్టుట. యీయేడు వ్యసనములున్ను వర్జించవలెను. ఇదిగాక, సుత నిధి దేవగేహ వనతటాక కృతి బ్రహ్మప్రతిష్ఠ మొదలైనవి సప్తసంతానంబులు పడయుచు, కవివిద్వాంస పౌరాణిక ఇతిహాస భట్ట పరిహాసక గాయకులను సభా సప్తాంగ పరివేష్టితుండై అసృక్ మాంస మేదో ధాతు అస్థి మజ్జ శుక్లంబులను సప్తధాతువుల పరిజ్ఞాతుండై, లవణ యిక్షు సురా సర్పి దధిక్షీర శుద్ధోదకంబులను సప్తసాగర పరివేష్టితంబైన క్షోణీచక్రము నిర్వక్రంబుగా భుజాపీఠంబున ఆదరింపుచు, జంబు ప్లక్ష కుశ క్రౌంచ శాక శాల్మలి పుష్కరద్వీపంబులయందు నిజేచ్ఛ కీర్తిప్రభలు వెలుగొందజేయుచు, హిమవంత మాల్యవంత నిషధ వింధ్య పారియాత్రక గంధమాదన హేమకూటంబులను సప్తకులగిరి ప్రభావంబులు దెలియుచు కశ్యప అత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ జమదగ్ని వసిష్ఠులను సప్త మహాఋషీశ్వరుల తపస్సామర్థ్యంబుల కనిపింపుచు, శిరోవేష్టన కర్ణభూషణ గ్రైవేయక అంబర వాహన గంధ తాంబూలంబులను సప్తత్యాగంబుల నెరింగి, మరియు నాస్తిక్యంబు అనృతంబు అప్రసాదంబు అనర్థకంబు క్రోధంబు దీర్ఘచింత దీర్ఘసూత్రతయు యెఱుకగలవారల యెరుఁగమియు అర్థంబులయందు

అనాసక్తియు అనర్థకచింత నిశ్చింతకార్యంబులు శౌయమియు మంత్రంబుల రక్షింపమియు శుభంబుల ప్రయోగింపమియు విషయంబుల ననం బరగిన రాజ దోషంబులు గోకులంబుల నందనవనంబుల జలస్థల పదస్థల వణిక్క్రియ దుర్గరక్షణంబుల అర్థంబు లార్జింపుచు, పంగు అంధక మూక బధిర వికలాంగులు మొదలుగాగల పాంథుల దయతో నరసి రక్షింపుచు, భయాతురుఁడైన శత్రువు శరణన్నఁగాంచి రక్షింపుచు, ఆన్వీక్షిక దండనీతి అని మెదు తర్కవిద్యార్థ శాస్త్రంబుల రహస్యంబుల నెరింగి, రథారోహణ అశ్వారోహణ గజారోహణ పదలాఘవవిచక్షణుండై, దానధర్మ పరోపకారంబులగు ధర్మత్రయంబుల నెరింగి, ప్రభు మంత్ర ఉదాసీనులను త్రివిధంబులవారి నెరింగి, ఉత్పత్తి స్థితి లయంబులను త్రివిధంబుల నెరింగి, ప్రాతర్మధ్యాహ్న సాయంకాలంబు లను త్రిసంధ్యానియమస్థుండై, ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులను త్రేతాగ్నిహోత్రంబుల నలుపుచు, శైత్య మాంద్య సౌరభ్యంబులను వాయుమార్గత్రయంబుల నెరింగి, యేలాగరు క్రముక ధవళపత్ర ముక్తాఫల చూర్ణంబు లను త్రిగుణాత్మకరూపంబైన తాంబూలంబులనుభవింపుచు, సత్వరజస్తమోగుణంబులను త్రిగుణంబుల, నెఱింగి ఉత్తమమధ్యమాధమములను త్రివిధనాయకాలక్షణంబుల నెఱింగి, ధర్మార్థ కామ్య మోక్ష చతుర్విధ పురుషార్థపరుండై, వేద శాస్త్ర పురాణ ఇతిహాసంబులను చతుష్టయంబులపరీక్షింపుచు, ఋగ్యజుస్సామాథర్వణంబులను చతురాగమంబుల పరీక్షింపుచు, బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ భిక్షుకులను చతురాశ్రమంబుల వారిని దెలిసి రక్షింపుచు, రథగజతురగపదాతులను చతురంగబలస్తోముండై, మనో బుద్ధ్యహంకార చిత్తంబులను చతుర్విధంబులఁ దెలిసి, క్షౌరాభ్యంగన దంతధావన నిర్మలవస్త్రంబులను చతుర్విధగరగరికలగలిగి, వస్త్రాభరణ గంధపుష్పంబు లను చతుర్విధ శృంగారవంతుండై, ఉన్మదన మదనమోహన వశీకరణ సంతాపంబు లను చతుర్విధమదనమార్గముల నెరింగి, భద్రదంత కూచిమార పాంచాల విట విదూషక పీఠమర్దన నాగరీకులపగిదిని హస్తిని చిత్తిని శంఖిని పద్మిని యనుచతుర్విధజాతిస్త్రీలక్షణంబుల నెరింగి, బాల్య యౌవన కౌమార లోలు లను చతుర్విధవయఃపరిపాకంబుల నెరింగి జార చతురిక సంసారిక దూతిక లక్షణంబుల నెరింగి, శబ్ద స్పర్శ రూప రస గంధంబులను పంచమహాభూతంబుల నెరింగి, శ్రోత్ర త్వక్ చక్షు నాసికా జిహ్వలను పంచేంద్రియంబుల పదిలస్థుండై, మిత్రభేద సుహుల్లాభ సంధివిగ్రహ లబ్ధనాశ అసంప్రేక్ష్యకార్యత్వంబుల నెరింగి,

ప్రారంభోపాయ పురుషద్రవ్య సంపత్తి దేశకాలవిభాగ వార్తా ప్రతికార్యసంధి యను పంచాంగంబుల నెరింగి నుడువుచు, పృథివ్యాపస్తేజో వాయురాకాశంబులను పంచభూతాత్మకములను ప్రాణాపానవ్యానోదాన సమానంబుల పంచప్రాణస్థానజ్ఞుండై, అరవిందం అశోకం చూతం మల్లికా నీలోత్పలంబులను పంచబాణములకు లోనుగాక, ఊదుట మీటుట వ్రేయుట రచ్చుపైకం ఆలాపంబులను పంచ మహావాద్యంబుల నెరింగి, భక్ష్యభోజ్య లేహ్య చోష్యపానీయంబులను పంచవిధ ఆహారంబుల నెఱింగి, కటు తిక్త లవణ ఆమ్ల మధు కషాయంబులను షడ్రసక్షణంబుల నుడువుచు, సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయంబులను రాజషాడ్గుణ్యంబుల నెఱింగి, హరిశ్చంద్ర పురుకుత్స పురూరవ సగర కార్తవీర్యులను ఆర్గురు చక్రవర్తుల చరిత్రంబులు వినుచు, గయ, అంబరీష శశిబిందు అనంగ్గు పృథు నృగు మరుత్త భరత రామ దిలీప శిబి రంతిదేవ యయాతి మాంధాత భగీరథులను పదార్గురు రాజుల కథాశ్రవణ..... జైన కాపాలిక బౌద్ధ చార్వాకంబులను షడ్దర్శనంబులను యెఱింగి, వేదాంత, వైశేషిక, భాట్ట, ప్రభాకర, పూర్వోత్తర మీమాంసంబులనియెడు షట్ఛాస్త్రంబుల పరీక్షింపుచు, ధనధాన్యవస్తువాహన బంధుజన దాసీదాసాదిజనులను గలిగి. భోజనవస్త్రగంధపుష్పతాంబూలంబుల ప్రియకామినీ సంగగోష్ఠియు పాన్పులను అష్టభోగంబులనుభవింపుచు, కులము రూపము విద్యయు ధనము చలము బలము యవ్వనము రాజ్యంబులను అష్టమదంబులను అహంకరించి, కస్తూరి కర్పూరం చాందు జవ్వాజి అగరు పన్నీరు తట్టుపునుగు శ్రీగంధంబులను అష్టసుగంధంబుల పరిమళలేపనుండై, వాగెయు బహుమానంబు కేళయు శస్త్రసాధనంబు వీరాస్త్రంబుల రాకయు అను అష్టావధానంబుల నెరింగి, శృంగార వీర కరుణ అద్భుత హాస్య భయానక బీభత్స రౌద్రావేశుండై, ముక్తా మాణిక్య వజ్ర వైఢూర్య గోమేధిక పుష్యరాగ నీల ప్రవాళ మరకతంబులను నవరత్నపరీక్షితుండై, పద్మం మహాపద్మం శంఖ మకర కచ్ఛప ముకుంద కుంద నీల వరయను నిధానంబులనుగల్గి, సనయమభరతజలను అష్టగణలక్షణంబుల నెఱింగి, స్వరవడి ప్లుతవడి ఉభయవడి హ్రాద్యను స్వరవికల్ప ప్రాగ్భవ సంశయప్రభువిభాగంబుల కాకు ఆవేశ నిత్య ఆర్య అఖండవర్గ తక్కటి యెక్కటి సరస లాటవళులను ఇరవైవళ్లభేదముల నెఱింగి, ఋతునాయక అభ్యుదయ వనగిరి రతి కేళి జల ప్రమాణ రత మధుపాన క్షితిపతి పుర సుత మంత్ర దూత పరిణయాదు లనంబరగిన అష్టాదశవర్ణనములు దెలిశి, సంస్కృత ప్రాకృత శూరసేన మాగధ పైశాచిక చూళిక అపభ్రంశ

తెనుగులను అష్టభాషాప్రవీణుఁడయి, యతిభంగ ఛందోభంగ పునరుక్తి సంశయ ప్రక్రమ వృథాలావర్త విహూపిత శబ్దవిరోధంబు గ్రామ్యంబులను దశవిధ అపశబ్దంబుల జొరనీయ్యక, నవరసాలంకారుండై ఛందోబద్ధమై, మృదువర్ణనవాక్యంబులు గలిగి, వాక్యం దశ పీతాభావవైభవంబుల నెరింగి, లక్షణ లక్ష్యంబుల కావ్య నాటకాలంకారంబుల జెప్ప నేర్చిన సుకవుల నరసి రక్షింపుచు, చూచుట చింతించుట వగచుట ఉస్సురనుట కొనియాడుట సిగ్గునెరుంగకయుండుట అన్నం బరోచకమగుటజ్వరమువచ్చుట నాలుకతొట్రుపడుట జీవంతొలగజూచుట అనియెడుదశావస్థల మర్మములనెఱింగి, వణకుట నొప్పివచ్చుట గరిగరిక విసుచుట కలహియగుట చింతనొందుట దైన్యమునొందుట దుఃఖియగుట పొర్పులుపొగలుట వున్నచోట కెలసుట ఆత్మపరుచుట నిరాహారియగుట క్రాగుట పానంబుదాల్చుట అరజీవంతొలగుట పంచత్వమునంబరగిన షోడశావస్థలభేదంబు లెరింగి, అంగుష్టం అరకాలు మడిమెమోకాలు జిహ్వా ఉరం నాభి కుక్షి కుచ వక్ష గళ అధర కపోల నేత్ర ఫాల మస్తకంబు లను షోడశకలాస్థానమర్మంబుల దెలిసి, వెలిదంమి కలువ విరిశము మామిడి జాజి పొన్న పొగడ అశోకము విసువాజి మల్లె మొల్ల గేదంగి వావి కలువ సురపొన్న కదళికాపుష్పంబులను షోడశబాణంబుల నెరింగి, చిగురువిల్లు చెరుకువిల్లు తీగెవిల్లు పూవిల్లు నాల్గువిధంబుల విండ్లును దెలిశి, తేటినారి కురువేరునారి చిగురునారి తీగెనారి యనంబరగిన నాలుగువిధంబులనారులును నాలుగువిండ్లును ఎక్కుబెట్టి షోడశబాణములున్ను షోడశకళాస్థానంబుల గురిజేసి యేయుమరునకు లోనుగాక, చాపష్టివిద్యాప్రవీణుల అరశి రక్షింపుచు, దుష్టజననిగ్రహంబును శిష్టజనపరిపాలనంబును జేయవలయు. ఇంకా రాజనీతులు అనేకములు గలవు. అందుల కించిత్తువిన్నపం జేశితిమి. అని అప్పాజి అయ్యమరసు కొండమరసు బాచరసు మొదలయినవారు విన్నపం జేశినందులకు, కృష్ణరాయలవారు వార్లనుజూచి మీకు భూతభవిష్యద్వర్తమానములున్ను దూరదృష్టికార్యములున్ను ఆగత అనాగతములున్ను తెలిసినవారలుగనుక రాజనీతులన్నిన్ని కరతలామలకముగా పలికితిరి. భ్రమరము వాయువుచేత పువ్వులవాసన యెరింగినట్లు భ్రమరకీట న్యాయముగానున్ను నగరికి ఆదాయమున్ను అయ్యేటందులకు యేరీతునని అడిగినందులకు సామాజకులు ధర్మంతప్పక నడిస్తే నెలమూడువానలున్ను గురుసును. భూమిన్ని బహువుగా ఫలించును. నగరివారు న్యాయముతప్పక కలిగినఅప్పనం తీస్తేను నగరివారికి అధిక శ్రేయస్సున్ను గలుగును. అందునుంచి బొక్కసభండారములకు రొక్కరూపాయీలు బహువుగా వచ్చును అని రాజనీతి చెప్పినందులకు——

పద్యం క. న్యాయము ప్రజపెక్కువకు ను
పాయము ప్రజకలిమి సిరికుపాయం బగుటన్
న్యాయమె భండారము నర
నాయకులకు నంద్రు కీర్తి నారాయణుఁడా॥

అని నీతిచదివి వినిపించి సాధువులైన వార్లకున్ను, సాధుజంతువులకున్ను, బాధ చేశేవారిని శిక్షింపక పరాకు జేస్తేను రాజధర్మత్వమున్ను, ఐశ్వర్యమున్ను, చేశినపుణ్యమున్ను, క్షీణమైపోవునని సిద్ధాంతం. ఇదిగాక ద్వాపరయుగమందు కలియుగాదిని పరీక్షిత్తుమహారాజు రాజ్యాభిషిక్తుడై మీావలెనే ధర్మశాస్త్రములున్ను, కృతయుగమందు నాలుగుపాదములున్ను, త్రేతాయుగమందు మూాడుపాదములున్ను, ద్వాపరయుగమందు రెండుపాదములున్ను, కలియుగమందు వొాఖపాదముగనక ధర్మదేవత ధేన్వాకారమై ధర్మరాజు ధర్మపరిపాలనము శేయంగ యిన్నాళ్లు సుఖానవుంటిమి; యిప్పుడు కలిప్రవేశమాయెను. మూాడుపాదాలు అధర్మమున్ను, వొాఖపాదం ధర్మము గనక కాలునిలుపరాదని వొాఖపాదం నేలమోపలేక దుఃఖాక్రాంతమైవుండగా, పరీక్షిత్తుమహారాజు నగరుశోధనకు ఏకదేశాన బయలుదేరి రాగా ధేనువును గని కాలు నిలువలేక కన్నీరుతోడట్టు చింతింపుతావుండగా జూచి, సాధువులైనవార్లను యెవరుబాధజేశిరో అని రాజు కామధేనువును అడిగినందులకు—నీవు నన్నడుగ కారణమేమి? నన్నుండి అన్యోప్రయోజనము లేమివున్నది? అనిమందలించినందులకు మీానిమిత్యముగా అడిగినా నింతేగాని వూరకే అడిగినవాడనుగాను అని పలుకరించగా, మన్మునుంచి నీకు అన్యోప్రయోజనమున్ను శ్రేయస్సున్ను పరామర్శింపక వున్నట్టయితే హాని కద్దాయని అడుగగాను, అప్పుడు పరీక్షిత్తు చెప్పిన పద్యం.

క. సాధువులగుజంతువులకు
బాధలు కల్పించుఖలుల భంజింపని రా
జాధము నాయుస్స్వర్గ
శ్రీధనములు విడిచిపోవు సిద్ధము తల్లీ॥

అని నీతి చదివి తాను అర్జునపౌత్రుండు, అభిమన్యు పుత్రుండు, పరీక్షిత్తుడను వాడని అభిధానం చెప్పగా అప్పుడు కామధేనువు తాను ధర్మదేవతను అని తననిజస్వరూపము కనిపించి నీయాజ్ఞలో సకలమైనవారున్ను నడుచుకోవలెను. కలి దోషంబు తన్ను బారయకుండా నీవు రాజ్యముచేసే దినాలున్ను నాలుగుపాద

ములతోడట్టు సంచరించేటందుకు ధర్మం పరిపాలనం శేయవలెను. అని ఆశీర్వాదముచేసి అంతర్ధానంబు నొందె. గనక ఆపరీక్షిత్తు కలిదోషమునకు వుండతగిన స్థలములున్ను వుండేటందుకు నియమము జేశి రామరాజ్యమువలెను ప్రజలకు మృత్యువువలన తస్కరులవలన అనావృష్టిదోషమునకు భయములేకుండా ధనధాన్యములపరిమితముగా కట్టడ శేయించి సమర్థులై శతాయువు పరిపూర్ణులయి సుఖాన వుండిరి. గనక ఆరీతివలెను స్వామివారున్ను ధర్మపరిపాలనం జేసుక రాజ్యం యేలవలెనని తెలిపినారు, గనక ఆనీతులంతా అప్పాజి మొదలయినవారలచేత లెస్సగావిని రాయలవారు యీవరకున్ను యీశ్వరనాయడున్ను, నరసింహ్మనాయడున్ను, వీరనృసింహ్మరాయలవారు రాజ్యపరిపాలనం గావించినారు. గనక యిప్పుడు ఆరాజ్యములున్ను, దుర్గములున్ను, దేశములున్ను, కోటకొత్తళములున్ను, విష్ణుస్థలములున్ను, పుణ్యభూములున్ను, సామంత నరదురాజ్యములున్ను, జూచిరావలెనని పలకరించినందులకు స్వామివారు ఆనతిచ్చినకార్యం—ఉచితమే సరి, పెద్దలు ఏలినరాజ్యములు తొక్కిచూడవలెను. ఉన్నతావున్నె యున్నట్టయితె యేకార్యమున్ను తెలియదు. అటుగనక రాజ్యములోగలప్రజలున్ను స్వామివారిని పొడగనవలెను. శత్రుజనులకున్ను, సామంతరాజులకున్ను, పరభీకరమగునట్టుగాను చతురంగబలములతోడట్టు అష్టదిక్కులను త్రొక్కిచూచి కీర్తివెలయజేశిరావలెను. అనివిన్నపం జేసినారు గనక కృష్ణరాయలవారు ఆనందముబొంది భూవిస్తారమున్ను రాజ్యములున్ను జూడవలెను అని నిశ్చయించి మునకలుగా చారులవలన ఆయాదేశములున్ను, ఆయాదిక్కులనుండే దొరలు, మన్నెరికముల నడతలున్ను,

లోకవార్తలు తెచ్చుటకు వేగర్ల నియమించుట.

వారివారి కలిమిబలములున్ను, గ్రామాదులున్ను, పల్ల్య, పట్టణములున్ను, పండితపామరజనులు ఆడుకొనేవార్తలున్ను, కోటకొత్తళములయందలి నడవడికెలు దెలిశి నానాటి ప్రవర్తకములున్ను గోప్యముగావచ్చి పలకరించేటట్టుగా, కాలువేగంగలిగి బుద్ధివిచక్షణులై బహుభాషాంతరములు దెలిసి బహురూపములుగానున్ను సంచరించి అంతరంగవార్తలరశి వచ్చేటట్టుగా విజయాపురం, అహమ్ముదానగరం, బెడదకోట, రాజమహీంద్రం, ఆరంగం, చెన్నపట్టణం, శ్రీరంగపట్ణం, చదరంగపట్టణం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం, పుష్మత్తూరు, శివసముద్రం, పెనుకొండ, గోలకొండ, గుర్రంకొండ, పల్నాడు, మొరసునాడు, ఘట్టం శీమ, అరవరాజ్యం, మళయాళం, కొచ్చి, కొంకణ, కేరళం, విరాటపురం, వరాటదేశం, మగ

ధదేశం, మత్స్యదేశం, విదర్భదేశం, కాంభోజనగరం, కాశ్మీరఖండం, ఢిల్లీనగరం, ఇవి మొదలయినతావులకున్ను, తులువ, హైమ మొదలైనదక్షిణరాజ్యములకున్ను, చంద్రగిరి, గండికోట, కడప, నంద్యాల, బెల్లంకొండ, రాచూరు, ముదుగల్లు, నిడికల్లు, మైసూరు, మొదలయిన స్థలములకున్ను, వేగుర్లున్ను నియమించి అంపించిపట్టణములసంచరింపగా అహంకరించినారనిన్ని పరులత్రోవపోయినారని వినినా నన్ను వారిని ఆజ్ఞశేయమని కట్టడచేసినారమని మీరందరున్ను నగరి ఆజ్ఞమీరక నడుచుకొమ్మని ఆనతిచ్చినారు. గనక అవి మొదలు సమమైనవార్లున్ను భయస్థులై పట్టణములోనున్ను, వీథులయందున్ను, మార్గములయందున్ను, యెవరు యెదరుతాకిన యేమనితలంచేవారు లేక సుఖముగ సంచారం చేశేరీతికి నడిపించి రాయలవారు నిత్యకృత్యమున్ను రాత్రి కొలువు తీరినతర్వాత నగరుశోధనకు

కృష్ణరాయని నిత్యకృత్య వివరణము.

విచ్చేశి సకలకార్యములున్ను తెలుసుక, అరుణోదయానికి నగరికి వచ్చి కొంతతడవు పవ్వళించి యుదయాననే లేచి దంతధావన, ముఖమజ్జన, నామతీర్థపు కొలువుజేసుకొని పెద్దకొలువునకువచ్చి తాము రాత్రి నగరుశోధనకు బయలమెరశిన వేళ గనుకొన్నకార్యములు విన్నకార్యములన్నియు మనస్సుకు దెచ్చుకొని, తలారిజంగమయ్యను జూచి రాత్రి పట్ణములోని ప్రవర్తమానము లేమి అని అడుగగా సకలకార్యములున్ను విన్నపం జేసును గనక తాముజూచినందులకును సమరసముగా వున్నట్టాయనా విని వూరకెవుందురు. నడిచిన కార్యములలో బలదుర్బలములు తెలుపకపోతే యీపాళ్యాన యిటువంటివీధిని యీయీశ్రేణిలో ఇంన్నోయింటివద్దరాత్రినడచిన న్యాయములు తెలిసినవాడవుగావు నిన్నన నేరములేమి నీవుతలారికం జేశేదిన్ని మేము రాజ్యపరిపాలనం జేశేదిన్ని లెస్సాయెనని ఆగ్రహపడగా తలారి భీతిజెంద తాను రాత్రిపగలు నిద్రాహారములేక వీథులను మనుష్యులనుంచుక క్షణక్షణే నడుచు వార్తలు పరామర్శించి రమ్మని భద్రపరచి రాయలవారికి యెవ్వరు మరుగుపడ విన్నవించినారో అని పరామరిశించగా రాయలవారు నగరుశోధనకు వెళ్లి పరామరిశించగా కన్నకార్య మింతేగాని విన్నకార్యముగాదు అని యెంచి ఆదారభ్యం పట్టణములో కావలికట్లవారితోను జతనముగాగాచి నడుచుకార్యముల వచ్చి తెలుపుమని దిట్టపరచి రాయలదేవునివారు రాత్రి నగరుశోధనకు వెళ్లుదుమనని యెవ్వరిని అడుగక వీథులలో దుడుకులు రానియ్యక హెచ్చరికతో నుండుమని పలికి తానున్ను తనకు ఆప్తులయినవార్లున్ను తన్నుకొలి

చిన వార్లతోడట్టు రాయలదేవునివారు కొలువు దీరి నగరిలోపలికి పోయిన క్షణమే హజారమువద్ద కాచివుండి నగరుబీగముద్రలు అయిన రెండుఘడియలకు రాయలవారు లీలావతారముగా బయలుదేరే జాడ జూచి కనుపించుకోగ, అంతటంతట హెచ్చరికగా రాగా రాయలదేవుని వారుజూచి తలారిజంగమయ్యను పిలిచి మేము నిత్యకృత్యమున్ను నగరుశోధనకు బయలు మెరశి వత్తుము నీవున్ను నీతిగలవారున్ను దూరాన కనుపట్టకరమ్మని ఆనతిచ్చినారు గనక తలారి జంగమయ్య ఆదారభ్యం భయముగలిగి రాయలవారు నగరు శోధన జేశి తిరుగా నగరుప్రవేశం అయ్యేవరకున్ను వీథివీథుల వెంబడినే తిరిగి మరిగి తన విడిదికొంపకు పోవును. యీవర్తమానములు అప్పాజిగారు మొదలైన సామాజికులు విన్నవార్లై వారు వారు ఆలోచనపరులై తమతమ యిండ్లలోను రాత్రిపగళ్లు మాటపలుకు లాడుకొనేటప్పుడు యీది హెచ్చరికలు గలిగి ఆప్తాలోచనలు నడుపుతావుందురు. యీరీతిని వుండగా కృష్ణరాయలవారు నిత్యకృత్యమున్ను ప్రాతఃకాలమందు పద్యనీతి చదువుమని వింట్టువుండ్దురు. గనక వఖనాడు పద్యనీతి చంద్రయ్య తనకు రాకూడక తనకుమారుని నగరికి అంపగా ఆయన వచ్చి సంజయనీతి, విదురనీతి, చాణుక్యనీతి, భర్తృహరి శతకము, ఇవి మొదలయిన నీతి చదివినాడు గనక వఖపద్యమైనా తప్పక చదువగా రాయలవారు సావధానచిత్తులై వినేయెడల పద్యనీతిశతకమున వఖనీతిపద్యము.

క. బలవర్గము సామంతుల
బలమున కగ్గలముగల నృపాలుర కొప్పున్
బలిమి పెఱనృపతి కాజ్ఞా
బలసంపద కెంతదవ్వు బద్దెనరేంద్రా॥

అని నీతిపద్యము చదువగా రాయలవారు ఆపద్యము ఇనుమారు ముమ్మార్లు చదువుమని మనస్సునకు తెచ్చుక వఖనాడు కొలువులోపలను కరణీకుల పిలువనంపి వారలతోను కర్నాటక సింహాసనానకు యెన్ని లక్షలరాజ్యములు? ఆరాజ్యములో గిరిదుర్గ, స్థలదుర్గ, వనదుర్గ, జలదుర్గములు యెన్ని? కోటలు యెన్ని? నగరములు గ్రామభూములు యెన్ని? యేయేదుర్గాలకుయెంత నగరిబొక్కసాన వుండె? రొక్కరూపాయలకున్ను, నవరత్నభూషణములకున్ను, స్థాపించివుంచిన నిక్షేపములకున్ను, శీమమణియగార్లమీద చెల్లునిలువకున్ను, నగరి కైజీతం, యేనుగ, గుర్రం, పరిజనాలకున్ను, వివరముగా లెఖ్ఖవ్రాసి

తెచ్చి చదువమని తొంమ్మిది సంప్రతులనున్ను పిలిపించి ఆనతిచ్చిరి. గనక చిన్నభండారం అల్లాలనాథుండు విన్నపం జేశినది. యీవరకున్ను వీరనృసింహారాయల వారు లెఖ్ఖ పఖ్ఖలు అడిగి పరామరిశించినవారు కారు. ఇప్పుడు స్వామివారు

కోశాది వివరణము.

లెఖ్ఖలు పరామరిక జేస్తున్నారు గనక యేయేలెక్కలు విన్నపం శాయమన్నారో ఆయాలెక్కలు శేఖరించి వ్రాసి నేటమర్నాటను అన్నియు విన్నపం జేశేమని లెక్కపక్కలు జాగ్రతగా రేయిపగలు వ్రాసి శేఖరించి ఆమరుచునాడు లెక్కలు విన్నపంజేశినది. విద్యారణ్యస్వాముల వారు యీపట్టణం గావించేటప్పుడు సింహాసనస్థునికి నిక్షేపించినది తొంబైతొంమ్మిదికోట్లు యాభైయారులక్షల ద్రవ్యంగాక భూషణములు నాలుగుకోట్లునున్ను, నవరత్నములు ఆరుకోట్లునున్ను, వున్నవి. అవిగాక యీవరకున్ను సింహాసనస్థులు సింహాసనమున్ను నడుపుకొని శెలవు శిద్ధాయాలుపోగా బొక్కసాన వుంచినది పందొమ్మిదికోట్లయాభైయారులక్షుల ద్రవ్యం. ఇదిగాక కర్ణాటకరాజ్యం పదికోట్లుయెనభై నాలుగులక్షులున్ను, దేవాదాయం, బ్రంహ్మాదాయం, సర్వమాన్యం,మరపరములకు అరవైలక్షలుపోగా నిలిచినది పదికోట్లునున్ను, ఇరవై నాలుగులక్షులరాజ్యాసజీరాసంజ్ఞోక గుఱ్ఱములకు, రోజు గుర్రం వొఖ్ఖంటికి నూరేశి ఘట్లు లెక్క గుర్రముల వెయ్యింటికి లక్ష ఘట్లవంతున గుర్రాలు యిరువైనాలుగు వేలింటికి, యిరువై నాలుగులక్షలున్ను, యేనుగు వఖ్ఖంటికి రోజువెయ్యేశి ఘట్ల లెక్క. యేనుగులు నూటయిరువై యింటికి పంన్రెండులక్షులకున్ను యేనుగులు వెయ్యిన్నీనూరు. బంటు వొఖ్ఖంటికి నెలకు ఘట్టి రెండేశి వరాలలెక్క. బంట్లు వెయ్యింటికి రెండువేల వంతున రెండులక్షుల బంట్లకు రోజు నాలుగు లక్షులున్ను, యీ లెఖ్ఖప్రకారాన అమరనాయకం, గుర్రాలు, యేనుగులున్ను, పంన్రెండువేలున్ను, కాల్బలములు రెండులక్షులున్ను, ఇందుకు రోజులకున్ను ఆయకం, ఆదవని, చెయ్యేటి దుగ్గం, గుత్తి, గండికోట, చంద్రగిరి, గుర్రంకొండ, మద్దూరు, సోమగిరి, త్రిశిరపురం, కున్నత్తూరు, పెనుకొండ, ముస్తీబులయిన దుర్గములున్ను, నంద్యాల, శ్రీరంగపట్టణాం, వుమ్మత్తూరు, దళనాయకుల కోట, వల్లంకోట, మధుర, పాళ్యంకోట,దిండికల్లు మొదలైన సత్యవేడు, కొట్టికల్లు, డంగిసీకోట, నారణావనం మొదలైన వనదుర్గములు దేశములు గలరాజ్యమున్ను యేలుకొని కొలుస్తావున్నారు. లెఖ్ఖ క్రమానికి శీమలుకొని యేనుగు, గుర్రములు, బంటు, బయుదలు, ఆపద్ధతికి కొలువక వున్నారు. గనక

చిత్తానకు తేనవధరించేటట్టు శాయవలెను. అనివిన్నపం శాయంగా రాయల వారు కరణాలతోను అమరనాయకానకు నగరికవిలె కావలిప్రకారానకు యేనుగు, గుర్రం, బంటు, బయదలకు వివరముగా లెక్క వ్రాసితెమ్మని ఆనతిచ్చిన తర్వాత నగర్కికై జీతం, యేనుగు, గుర్రం, రాణువకు లెక్క యేమిన్ని చదువలేదని మనస్సునయెంచి అప్పాజి అయ్యామరుసు మొదలైనవారిని జూచి ముందరనడిపించతగ్గ కార్యములకు ఆలోచన యేమని అడిగినందులకు, అందరున్ను వూరకే వుండగా సాళువతిమ్మరసుగారు ఆలోచనపరుడై యేమిన్ని పలుకరించక స్వామి వారు చిత్తానకు సరిపోయినట్టు నడిపింతామని సంబుద్ధిగా విన్నపంజేశినారు గనక రాయలవారు తమచిత్తాన సింహాసనపరభారమునకు కర్తలజేసినమాత్రం యింతేగాని సకలప్రపంచమున్ను సామాజికులు ముఖాంతరముగానే నడుస్తా వున్నది; తమమాట పలుకులు యెవ్వరు వినేరు. అధికారతరుణమందు స్వాతంత్ర్యముగానడిపిస్తే మంత్రభిన్నమై కార్యములు కొనసాగవు. కాబట్టి వాకిటి పిన్న పెద్దలు తమరయ్యే తెలుసుకొని వఖ కార్యం నడిపిస్తే అప్పుడు తమకు స్వతంత్రముగానడుచును. అనుచు, మనస్సున దూరయోచన యెంచి వఖ నాటిరాత్రి నగరు శోధనకు బయలుదేరినట్టు నగరువెడలి పట్టణానకు రెండామడదూరాన

కృష్ణరాయలు పట్టణశోధనకుఁ బోవుట

ఉత్తరపుదిక్కున వొఖదేవళము వుండగా అక్కడికిపోయి నిలిచి సంబివాణ్ణి నీళ్లుతెమ్మని దంతధావన ముఖమజ్జన నామతీర్థమై స్వామి నివేదనమైన ప్రసాదపణ్యారములు తెప్పించుక ఆరగించి కూర్చుండగా అంతట పట్ణంలో యెప్పటివలెనే సాళ్వ తిమ్మరసుగారు నగరికివచ్చి రాయలవారు పుష్పోదయమైనారో అని పరామర్శించగా అచ్చట కాచియుండే దాదులు హెగ్గడికత్తెలు బోనకత్తెలు అన్నగర్లు నిన్నరాత్రి రాయలువారు నగరశోధనకు పోయినట్లే యింకారాలేదని పలికినారు. గనక వారలతోను యికను యెవరువచ్చి అడిగినగాని రాయలవారు శిరోభారమై ఇంకా పుష్పోదయం శాయలేదని చెప్పేటట్టు నియమించి హజార ముఖానకువచ్చి కూర్చుండి గూఢచారులను అష్టదిక్కుల మార్గములున్ను పరిశోధించి యేకాంతముగవచ్చి పలుకరించమని అంపగా, ఆచారులు ఎనిమిది దిక్కులకుబోయి విచారించిరి. గనుక వారిలో పరిశోధకుండైన గూఢచారుఁడు వచ్చి సాళువతిమ్మరసుగారితో పట్ణానకు రెండామడ దూరానకు ఉత్తరముగాను పల్లికొండరంగనాథస్వామి సన్నిధికి ఏకాంతముగా విచ్చేశి కూచుండుక పట్టణముదిక్కు ముఖము చూస్తావున్నారని రహస్యముగా పిలువగా 'అప్పాజి

దొరమన్నీలకు, అమరనాయకుల కందఱికిన్ని రాయలవారు వేటబోవుతావు
న్నారు. మీస్తోమములతోడట్టు శీఘ్రగతిగా రమ్మని అందరికి చీట్లువ్రాయించి
అంపించి తాము మునుకలుగా తరలిపోయినారు. గనక పట్టణములోఁగల కాతు
లు, మావుత్తులు, బంట్లు, పరివారములున్ను, దొరలు, మన్నెరికములున్ను
అందరున్ను ఆక్షణమే కదిలి పోయినారు. అందుకు మునకలుగా తిమ్మర
సయ్యగారు కూడాను విల్లుబెట్టుమేరకు అందలముడిగ్గి బంటు బయుదలనున్న
యేనుగు గుఱ్ఱములనున్ను, బారుదీరివుండేటట్టు కట్టడజేశి మితజనముతోడట్టు
కొంతదూరముబోయి అచ్చట అందరినిన్ని నిలువమని యేకదేశాన తాము
వక్కరే కోటవెలపట వంటిగా పోగా రాయలవారు తిమ్మరసు వచ్చేదిగని పచ్చ
డము నిండారుగ గప్పుకొని నిద్రపొయ్యేరీతిగా వుండగా అప్పాజి రాయలవారివద్ద
చేతులు కట్టుకొని నిలుచుండి వుండగా కొంతసేపునకు కనుపించుకోక ఆత
ర్వాత రాయలవారు నిదురమేలుకాంచిన రీతిగా లేచి అప్పాజిని జూచిన వారై
మీరు యిచ్చటికి యేలవస్తిరి అని అడుగగా తిమ్మరసయ్య అడ్డబడి విన్నపం
జేశినది—స్వామివారు నిన్నరాత్రి నగరుశోధనకు బయలు వెరసినట్టే

తిమ్మరుసు రాయలవారిని మందలించుట

యిచ్చటికి విచ్చేశినమార్గము తెలియక యధావత్తు
గానే నగరికి పోయి పుష్పోదయమైనారో అని అడుగగ
హెగ్గడికత్తెలున్ను అన్నకళులున్ను రాయలవారు నగరు
శోధనకు బోయినట్టే వచ్చినవారుగారని చెప్పగా మనస్సుకు చాలావిచా
రమై ఆయాదిక్కులకు చారుల నంపగా అచ్చట విచ్చేశివున్నారని చెప్పగా విని
యీవార్త ప్రకటించరాదు అని మనస్సునయెంచి రాయలవారు వేటమార్గముగా
సాగిపోయినారు గనక దొరమన్నీల అందరినిన్ని తమతమ స్తోమములతోడట్టు
క్షిప్రగతిగా సాగిరమ్మని చీట్లు అంపించి వద్దనున్నవారితోను రాయలవారు
వేటమార్గముగా సాగిపొయ్యేటప్పుడు రమ్మని ఆనతిచ్చి అంపినారు గనక పో
వలశివున్నది అని వార్లతో మందలించి కదలి వస్తిని. స్వామివారు యీరీతిని
రావచ్చునా? యీవార్తలు లోకులకు తెలిసితేను పట్టణమున్ను కోలుపోవును.
దునేదారులు విన్నాన్ను అపకీర్తి, గనక యింతటికార్యముచేశేది అనుచితము.
స్వామివారి చిత్తాన యింతకార్యమెంచి రావచ్చునా అని నీతిమార్గముగా
నున్ను భయోత్పాతములుగానున్ను తెలిపినందులకు రాయలవారు సింహాసన
పరభారకం వహించే మీవంటిపెద్దలువుండగా అట్టికార్యములు యేలవచ్చీని

మీారుతృణాన్నిబట్టితే మేరువు శాయగలరు. ఆమేరువునే తృణముగా నడిపించ గలరు. అఘటనఘటనా సామర్థ్యములు మీాకే గలవు. అని వ్యంగ్యోక్తులుగా ఆనతిచ్చినందులకు సాళువ తిమ్మరుసయ్యా పలికినది—ఆరీతే అవును. అవి యేమియం టేను స్వామివారు సకలకార్యభాగములు మామీాద పూనికజేశి నడిపించంగా ఆరీతున నడుస్తావున్నది. చిత్తానకు రాకుంటే మేమనగా తృణమాత్రము. తృణ గ్రాహి యయిన యింద్రనీలము ఖ్యాతిబొందును. తృణమని యెంచి గ్రహించక వున్నట్టాయెనా జాతినీలముగాదని వెలతరుగును. అటుగనక యేలినస్వామివారి ప్రతాపమువల్లనేగదా కొలిచినవారు ఘనమాట. కొలిచినవార్లను ఘనముగా నడపగా నే యేలినవారికి కీర్తిఖ్యాతులు గలుగుట. అని ద్వంద్వార్థముగా విన్న పముచేశి పట్ణానకు విచ్చేయుడా అని తెలిపినందులకు రాయలవారు తనదొర తనమేమి అనంగా యేది తమ అంక్కవంక్కలకు యెవరు వచ్చేరు రానివారిని మేము యేమిచెప్పేము. దండించనర్హులముగాము. దండనాయకత్వము లేనివారికి ధరణియేలేదెట్లు, ధర్మపరిపాలనం జేసేదేరీతు, దుష్టనిగ్రహం శిష్టపరిపాలనం శా యలేనని చెప్పి తిరుగా అందుకు ప్రతిచింత కట్టివచ్చేము లేనప్పటికి రాకూడదని నాలుగారుఘడియలు ఆలోచనజేయగా, సాళువతిమ్మరసయ్యా స్వామివారు ఆన తిచ్చిన యంతమట్టున్ను యథార్థమున్ను కార్యసరవిన్ని అవును. అందులకు యిది బుద్ధియని ఆనతిచ్చినట్టయితే స్వామివారిప్రతాపమువల్ల అన్నికార్యములు న్ను అమరికలు అయ్యీాని. అని తెలిపినందులకు రాయలదేవునివారు తంమును స్వతంత్రులు తెచ్చిరిగా ఆరీతున్నే నడపించుడా అని ఆనతిచ్చి యిన్నాళ్లున్ను నీతి పద్యము వినిదుము పఖనాటి యంద్దున విశేషమైనబుద్ధిమార్గములుగా పఖనీతిపద్య ము వింటిమి గనక అదిమొదలుగా ఆరీతున నడిపించుకోవలెనని బుద్ధిబొడమి సా మంతబలములకన్నా అధికమైనబలాల సంతరించి తురకలమట్టుబెట్టవలెనని యెంచి నారము. యిందుకుయేమంటే కైజీతము లేకయేకార్యములున్ను కొనసాగదు. గనక యిప్పుడు కైజీతము, యేనుగు, గుఱ్ఱము, బంటు, బయదలు సహితముగా గట్టి ఆము స్తీదుతోడట్టు పట్ణప్రవేశం గావలెనని ఆనతిచ్చినారు, గనక సాళువతిమ్మరసయ్యా యీాకార్యమునకు స్వామివారు యీారీతున రావచ్చునా? యీాక్షణాన్నె దేవరవారి చిత్తానకు వచ్చేటట్టు యేనుగుగుఱ్ఱాలు బంట్లునందరినిన్ని సంతరించెదను. మరివెన కను చతురంగబలములతోడట్టు పట్ణానకువిజయం శేయండా అనివిన్నపంజేశినందు లకు యీాక్షణాన్నె నగరియేనుగ గుఱ్ఱము బంటుసహితముగా అమరికజేసెను, అని

విన్నపము జేశి తోడుతోనే దొరమన్నె వార్లను అమరనాయకంవార్లను రస్తుతు రాణువును డెబ్బై రెండువిని యోగాలవారున్ను కొలువునకు రమ్మని కులాచారం కరణీలపిలిపించి వారితోను సింహాసనాన అమరనాయకం యేనుగులెన్ని, గుర్రాలెన్ని, కాల్బలం ఎంత అని అడిగినందులకు గణికులు పలుకరించ్చినవివరం.

రాయలసేన వివరణము.

గుర్రాలు యిరువైనాలుగువేలు, యేనుగఘట్టాలునూటయిరువై, కాల్బలము రెండులక్షలు. ఇందులకుస్థితి నెలవక్కంటికి నలభై లక్షలువంతున సంవత్సరానికి నాలుగుకోట్లు యెనభై లక్షలకు అమరనాయకానకు శీమలు ఏలుచున్నారు, అని గణికులు విన్నపం చేశినందులకు వారలతోను రాయలవారు అమరం యేనుగు గుర్రాలకున్ను, బంట్లకున్ను, నేడు నాలుగారు ఘడియలలోగా గణుతిపెట్టిగణుతికిలేని యేనుగు, గుర్రాలు, కాల్బలమునకు, వీరనరసింహరాయలవారు యేలుకొన్న దారభ్యాం యీవరకున్ను పదిసంవత్సరాలాయెను గనక వారివారిమీద రొక్కనిలువలు లెఖ్ఖజూచి తోడుతోనె నిలువరూకలు అరువుశాయమని నిరుత్తరుస్రగా ఆనతిచ్చిరి గనక అదేరీతికి కరణీలు వెలపటికివచ్చి గుర్రం, రాణువ, గణుతిపెట్టంగ వఖటికినగమున్ను నాలుగింటికి వఖపాలున్ను గణుతికి తక్కువబడెగనక అమరగార్లమీదనిలువ రొఖ్ఖమునకు ఆక్షణముందే వొప్పజెప్ప మనగా వార్లు బహుదినాల నుంచిన్ని ప్రఖ్యాతిగా తిన్నవారు కాబట్టి తమమీద నేరం తప్పిపోతే చాలునని తమమీది మోపాదిఅయిన రొక్కానకు యియ్య వెరవు లేదు గనక శీమల యెప్పటివలెను నడిపితేను యిప్పుడు వుండే యేనుగు గుర్రాలను నగరికి వెలకట్టి యిచ్చి ఆపిమట తాము సంతరించుకొనేము, అని విన్నపం శాయంగా మంచిదేయని అమరగార్లమీది నిలువలకు యేనుగు గుర్రాలను వెలకట్టుకోగా యేనుగులున్ను పండ్రెండువేలగుర్రాలున్ను లక్షబంట్లు యేలేదొరలనున్ను నగరి శరబడి ఆయనుగనక ఆయేనుగు, గుర్రాలు, కాల్బలము, రాయలవారిసముఖానకు తెచ్చి విడిచి చిత్తం వచ్చినవారికి వెచ్చబెట్టండా యని విన్నపం శేయంగ, రాయలవారు ఆశ్చర్యపడి అప్పాజిగారితో అఘటనఘటనాసామర్థ్యము మీకె కలదు అని ఉచితసప్తాంగము, కుళ్లాయి, కబాయి, తాళి, చౌకట్లు, పీతాంబరం, గంధ కస్తూరి తాంబూలాదిగాయిచ్చికై జీతం యేనుగలకు తుళువ మావటీలున్ను, కై జీతం గుర్రాలకు కబ్బిలిరాతులున్ను, మొరసరాతులునున్ను, తుళువరాతులునున్ను, యేలిక బంట్లను వ్రాయించి ఆపిమ్మటను రాయలవారు బంగారుచౌడోలు ముస్తీ

పులయిన మాస్తిమదహస్తియనే యేనుగనుయెక్కికొని సాళువతిమ్మరసయ్యను తమవెనకను కూర్చుండమనిచతురంగబలముతోడట్టు విద్యానగరపట్టణప్రవేశమై తర్వాత అప్పాజి తిమ్మరసు మొదలయినవార్లను యిండ్లకు పంపించి తమ ఆప్తులతోను అప్పాజి సాళువ తిమ్మరసయ్యాలవలె నియ్యోగులు కద్దా అటువంటి నియ్యోగులు వుండగా వఖనాటనే కైజీతం కట్టవలెననిన్ని, లేకుంటె పట్ణానకు రామనిన్ని దుష్కరవచనంగా పలకరించినందుకు తాలిమి గలిగి ఆతీరునె అమరిక జేసెను, అని యేనూరు యేనుగులున్ను, పండ్రెంపువేల గుర్రాలున్ను, లక్షమనిషిబంట్లనున్ను, నిమిషమాత్రాన సముఖానకు రప్పించి చిత్తంవచ్చిన వారికి సెలవుశాయమనగా, చూచి అశ్చర్యపడి ముందర తురకాణ్యాంమీద కార్యం శేశేవారమై కర్నాటకరవుతుల మావుతుల సంచరింపవలెనని దృష్టిచేత కబ్బలికాతులకున్ను, తుళువకాతులకున్ను, మొరసకాతులకున్ను, పండ్రెండువేల గుర్రాలకున్ను, యేలికబంట్లుగా వ్రాయిస్తిమిఅని మాటిమాటికి కొనియాడుతా పలకరించి మరివెనుక గుర్రాలు పండ్రెండువేలున్ను, యేనుగులు యేనూరు మావటీలు వెచ్చబెట్టి ఆయాగుర్రాల కాతులకు మావటీలకున్ను సంబళం సారికెలు కట్టడజేశి ఆయాలాయం గుర్రాలకు కవళములు పరామ్శించేటట్లు నలుగురుపారుబత్యగార్లను ఆరుగురుకరణాలనున్ను పదారుగురు అంగజాడులనున్ను ఆరుగురుముషువుగొల్లలనున్ను కట్టడచేసి, నానాటి చెల్లువెచ్చానకు బొక్కసాన యిమ్మనేటట్టుగా నిరుత్తరవుచేశి నల్లప్రజలు లక్షకున్ను నెల నెలకు తప్పక సంబళం దిద్దుమని వాఖకర్ణీకం యేర్పాటుచేశి మరి వెనుక నేడుగదా దొరతనమున్ను ప్రభుత్వమున్ను యేర్పాటు ఆయను అని సంతసించి, మరిన్ని అమరగార్లకు యేనూరు యేనుగులు, పండ్రెండువేలుగుర్రాలు క్రయంగట్టియిచ్చేటప్పుడు వఖరైనా అన్యాయ మనకుండా వారువార్ల సమ్మతిమీదనే క్రయంగట్టియిచ్చిరి గనక ఆయేనుగులక్రయం విన్నప్పటికిన్ని సగటున యేనుగ వక్కంటికి ఆరేశివేలలెఖ్ఖ యేనుగలు యిరువైయింటికిన్ని లక్షయిరువై వేలవంతున యేనుగు ఘట్టము యాభైయింటికి ముప్పైలక్షలున్ను, గుర్రాల క్రయం గుర్రం వకంటికి యేనూరు వరాలవంతున గుర్రాలు వెయ్యింటికి రెండు లక్షలలెఖ్ఖను గుర్రాలుపండ్రెండువేలకు యిరువైనాలుగులక్షలున్ను, నిమిష మాత్రములోగ యేనుగుల గుర్రాలవల్ల నగరికి ఆయాభైనాలుగులక్షలకు ఆదాయంజేసెను.

సాళువ తిమ్మరసు ప్రశంస.

"అపూర్వమైన మనుష్యులు దొరికితేను సకలమున్ను సంతరించ్చ వచ్చును" అని రాయలదేవుండు పలకరించగా అయ్యమరసుగారు విన్నపంజేశినది. "సింహాసనస్థునకు స్త్రీలున్ను రత్నములున్ను కలిగినది అయితే అంతకన్నా అధికం మహీపతులకనగా సీతి పద్యం.

పత్ని ధరిత్రియుఁ బురుషులె
రత్నము లెప్పుడుఁ బురంధ్రిరత్నములు శిలా
రత్నము లవనీపతులకు
పత్నులె రత్నములె తలఁప బద్దెనరేంద్రా.

అని అన్నారుగనక రాజులైనవారలు అనువైన పురుషరత్నాన్ని సంతరిస్తె ఆయన నవరత్నములున్నూ చతురంగబలములనున్ను సంతరించ్చ గలడు. అటుగనక అప్పాజి సాధారణ నియ్యోగిగా నెంచవద్దు. ఆయన అసాధారణ నియ్యోగి. అఘటనఘటనాసామర్థ్యం ఆయనకెగలదు. అది యేలాగంటేను— అందరున్ను మనుష్యులు. అందరికిన్ని అవయవాలు సరి. యిందులో ఉత్తములు మధ్యములు అధములు అనియెరిగి యేర్పరచవలెను. అదియేలాగంటేను—గుణాధిక్యము వల్లను యెక్కువ. మరిన్ని పంచలోహములున్ను అన్నియుసరి. అందున బంగారు హెచ్చింది యేది అంటేవ్వరియకకురాంగా వన్నె హెచ్చించినట్లు గుణాధిక్యమువల్ల మనుష్యులలోనున్ను అప్పాజిని అధికుడని యెరుగవలెను. అది యేలాగంటేను

శ్లో. శతేషుజాయతే శూరః సహస్రేషుచ పండితః,
వక్తా శతసహస్రేషు దాతాభవతి వానవా.

అనేనీతిప్రకారానకు నూటికివకబంటును వెయ్యింటికి వకపండితుండున్ను లక్షకు వకడు వక్తుండై సభాస్థలిని మాటపలుకులాడును. కోటిలో వకడు దాత అనేదికలండో లేడో అన్నట్టు వకరుగాక అందరికిన్ని ఆగుణములు యేలవచ్చీని. అని అయ్యమరసు విన్నపంజేసి ఆప్తాలోచనగా వార్తలాడుతా వుండగా విజయాపురాననుండి వేగర్లు వచ్చినారని మారీచిరామయ్య వచ్చి కృష్ణరాయలవారితోను విన్నపంజేసిన వివరం.

విజయాపుర వృత్తాంతము

విజయాపురానకుబోయి పట్టణంవెళిపాళ్యములు, కోటకొత్తళములు, రవుతులు, మాన్నుత్తులు, యేనుగు గుర్రాలు, కాల్బలం, అమరనాయకవార్లను నందరినిన్ని జూచి నగరివాకిటికి పోయి, దాడి

మహాలు ముంచుగా ముందరదివాణంలోముందర యాయావజీర్లు దొరలు దోండో పండితులు మొదలైనవారు నియోగ్యాగులు వారివద్ద కుతపనమలక వారిహేజీబులు ముకుందపండితులు మొదలైనవారు కూర్చుండి ఆలోచనజేసినది:—కర్నాటక సింహాసనానకు నడవంగా కృష్ణరాయలవారిని అధిష్టానకర్తలజేసిన దారభ్యం తురకలమీద కార్యంశాయవలెనని ఆలోచనజేశి అందులకై యత్నములు చేస్తా వున్నారు. అన్ని వివరాలకు విజయనగరానినుండిన్ని కాకితములు వ్రాసివచ్చెను.

**అశ్వపతి గజపతి నరపతులతారతమ్యము.**

అశ్వపతి గజపతి నరపతులలో నరపతిసింహాసనమే అధికము. కడమ రెండు సింహాసనములున్ను వారివెనుకను అని పిన్నపెద్దలు ఆలోచనగా చెప్పినందులకు గోలకొండవారి ముద్దాపండితులు "సింహాసనాలంటె మూడున్నసరి. యిందులో సింహాసనాధిక్యములు కలవా" అని ఆగ్రహపడగా నిజాంరఫుతులు మావృత్తులు లశికరీతనాన సరిగదా ద్రవ్యసామగ్రి యందు దుర్గములయందు కొదవ; అట్టిపట్ల అధికమని చెప్పవలసిన కారణమెద్ది? అన్నందులకు గోలకొండవారి ముద్దాపండితులు వ్యంగ్యోక్తముగా కాకయేమి మరేమి యిందులలో న్యూనాధిక్యములు యెంచ అవకాశమేమివున్నది? వొకరి కొకరు ఏకవాక్యముగా ఆడుకొన్నందులకు బాహుబలేంద్రుని బ్రహ్మయ్యపంతులు వారలతోను యీమూడుసింహాసనములనగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అంశలుగావుండును.అందునకు తారతమ్యములు యేరీత్యా ఆరీతువలెనే అశ్వపతి గుర్రాలకున్ను, గజపతియేనుగలకున్ను, నరపతి కర్నాటకసింహాసనమునకున్ను గనక నరపతియే హెచ్చు. అదియేలాగంటేను—భగవద్వాక్యం 'నరాణాంచ నరాధిపం' అనేవచనమువల్లనున్ను ఆరాజ్యములోను దేవాదాయం బ్రహ్మాదాయం పుణ్యతీర్థములు నదులు పుష్కరుణులు గలిగివున్నది. యిదిగాక విష్ణువు ప్రత్యక్షమై వెంకటాచలాన వున్నారు. ఆరాజ్యములోవుండే స్వామికి కడమరాజ్యములలో పెద్దలు బుద్ధిశాలులు బ్రాంహ్మణులు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైన వారలందరున్ను కానుక కప్పములు కొంచుబోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు. గనక కర్నాటకం సింహాసనాధిపతులు పుణ్యశ్లోకులు. ఆపిమ్మట గజపతి సింహాసనమందు జగన్నాయకులు వేంచేశివున్నారు. గనక రెండోపర్యాయము. అశ్వపతివారున్ను గంగాతీరాన విశ్వనాథులరాజ్యములోవున్నారు. వారితెగలవారి యెమలషాహు, కుతుపనమలక, నిజాంశాహు, యీమూడు తెగలవారున్ను కర్నాటక సరదునవున్నారు. మీారుకర్నాటకాధిపతులతో సరియననగునె. అని

మధ్యస్థభావముగా అన్నందులకు దొండ్డోపండితులు, ముద్దోపండితులు, దాదో పండితులు ముగ్గురున్ను దొడ్డనియ్యోగులుగనక తెలుసుకొని తమదొరలు మద్యపానులు దేవబ్రాహ్మణవిశ్వాసము లేదు. మ్లేచ్ఛులు, గోహింసకులు. వారిని గొలిచినవారము గనక దూరదృష్టి విచారించుకొన అవకాశ మంతలేక అహంకార గుణమువల్ల అనవలశిన దంటిమి. బ్రాహ్మోపంతులవారు పలకరించినది యథార్థమని మెంచినవారై ఆతర్వాత మంత్రాలోచనగా వార్తలాడినవి. కర్నాటకం వారు సరదుబలపించ్చివచ్చే గజపతి వారికిన్ని మనకున్ను మున్నెరికగా వుండగా వుండును. ఆరీతుగాకుండ అందునకైన యత్నంగని సరదు దుర్గాలను రస్తుసామగ్రీలు వేయించి బలవంతముగా యేనుగు గుర్రాలు కాల్బలములు వుంచవలెను." అని ఆలోచనచేశినవారై యెదులశాహు వారిఃోను యీపర్యాయములు యెరుకశాయగా ఆగ్రహపడి "కర్నాటకంవారు తుంగభద్రదాటి వచ్చిరా యీవరకున్ను యీశ్వరనాయకుడున్ను నరసనాయకుండున్ను వీరనరసింహరాయలవారున్ను యేలినందుకంన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది" అని అన్నందులకు దొండోపండితులు మొదలైనవారు "రాజనీతి అని మొనకురాదు. గనక వుండేయత్నములు వుండగా దైవసహాయం యేతీరో తెలియదు గనక నిజాంశాహువారున్ను, కుతుపనమలకవారున్ను విజయనగరాననుండి కాకితములువ్రాసి వచ్చినది విని ఆలోచనపరులై యిక్కడికి కాకితములు అంప్పి తమతమ సరుదు స్థలములు పదిలపరుచుకొని యాది హెచ్చరికలతోవున్నారు. బాహుబలేంద్రునివారి బ్రాహ్మోపంతులు వారి వారి సరదు గిరిదుర్గములయందు రస్తుసామగ్రీలు వేయించి బలవంతముగా వుండేటట్టుగా యేనుగు గుర్రాలున్ను రవుతులున్ను అంపించేవారై వున్నారు. మన మున్ను ఇక్కేరి బసవాపట్ణంశంకరనాయుడు ఆదికొమాళ్లు బోయిరామప్పగారి సరదుస్థలాలకున్ను రస్తుసామగ్రీలున్ను మూకస్తోమాదులున్ను అంపించవలె" ననగా ఆతీరునె అంప్పించమని విజయాపురంకోటకొత్తళములున్ను లెస్సగాతీర్చి రస్తుసామగ్రీలు వేయించమని మందలించగా, వాకిటి పారుబత్యగార్లు యెనిమిది దినాలనుండిన్ని ఫిరంగి, జపురుజంగులు, గుంట్టుకోవ్రులు, దంతెనరాళ్లు, యెత్తురాళ్లు, గశికలు, పులితలలు, కోట వెలపట గుర్రాలు జొచ్చిరాకుండా గుర్రపువిలువురాళ్లు, వేయించేదిన్ని, దిక్కులకు వేగుర్లను అంప్పి నానాటి సమాచారములు తోడుతోనే వచ్చి తమతో దెలుపుమని అరవై వేగుర్లను విద్యానగరపట్ణమునకంపిం

చినారు. విజయాపురిదేశములోగల ప్రజలందరున్ను ఆలోచనపరులైవున్నారు. సరదులవుండేవార్లు యీవార్తవిని చీటిపాటిచిక్కుచిల్వానములు విజయాపురానకు అంపుతావున్నారు, అనిన్ని ఆపట్టణములో వారువారు ఆడుకొనే వార్తలున్ను కన్నవిన్నదియంతాను విన్నపం శేయగా, రాయలవారు అప్పాజి అయ్యమరసు కొండమరుసు గారు విని, విజయాపురం అహమదానగరం గోలకొండ వారికి యిక్కడవుండేవారి స్థానాపతులు నడిచిన ప్రవర్తమానములు వ్రాశి అంపిన కార్యానికి యాదిహెచ్చరికలు కలిగి, యింత ఆలోచనచేశి యదుకులశాహున్ను తెలిపి ఆయనాను సరుదుస్థలాలకు రస్తుసామగ్రీలు అంపించినారు గనక వారి యాది హెచ్చరికెలున్ను కలిమిబలుములకున్ను సరివుంన్నదా అని వేగులవారికి వుడుగరల యిచ్చి విజయాపురానె వుండి నానాటివర్తమానములున్ను లెస్సగా తెలుసుకొని అంపి, వద్దనున్న వూడిగవార్లను కడకుపొమ్మని అప్పాజిమొదలైన సామాజికులున్ను రాయలవారున్ను ఆలోచనగా మాటలాడుకొన్న వివరం. రాయలవారు అప్పాజి మొదలైనవారితోను "మేము ఏకదేశాన ఏకవదంతిగా తురకాణ్యంమీద కార్యం చేయవలెనని యెంచిన ఆలోచనకు యిప్పుడె నడిపిస్తావున్నారు. యీకార్యం ధైర్యంమీదనడిపేదో భీతిచేత హెచ్చరికపడేదో" అని అడిగినందులకు అప్పాజి ప్రభృతులైనవారు దిక్కులవార్తల విన్దురు. విన్నవేళకు ఆప్రసంగములు తలపక నాలుగార్లుదినములు వెనక సరుదు స్థలాలుచూచే నిమిత్యముగా ఆశీమాధిపతి వస్తున్నాడని వదంతిపుట్టించి ఆయాస్థలముల వుండేవారికి కోట కొత్తళములున్ను రస్తుసామగ్రీలున్ను వైచి యాది హెచ్చరికలతో వుండవలెనని సమదళంవారు సంతిరించేటట్టు నడిపించే గంహారమున్ను ధైర్యమున్నగాక యీరీతి నడిపించేదెల్లా బుద్ధిచంచలత్వాన నడిపించే ప్రయోజన మని అన్నందులకు, అయ్యమరసు కొండమరుసుగారు "తురకలనగా మద్య

తురుష్కుల పానులు, మందుతినేవారు, లాలాదిపురుషులు గనక వార్లకుచాలా

శీలము. భీతిగలిగి యుండును. పానముజేసినంతపొద్దున్ను తమదేహములు తా మెరుగరు. గనక ఆసమయమందు స్మరణయెరుగరు. అప్పుడు యెవ్వరు అడ్డమైన నరుకుదురు. కలియుగ రాక్షసులతీరై వుందురు. స్మరణ తెలిశిన తర్వాత తమజాతి స్వభావం యిటువలెగదా అని విచారపడుదురు. బ్రాంహ్మణులు వుప్పు పులుసుతో అన్నం ప్రసాపడుదురు గనక వారలకు మద మాత్సర్యములు లేవు. అని యెంచి వాకిటి పారుబత్యమంతా వారినె శేయమని తమ ఆజ్ఞలోనడుచుక వారిమాట

మీద నామజాములు అంపుతా వారు తీశిరమ్మంటె తీసివచ్చేటట్టు యేర్పాటుచేసి తాామున్ను వారిబుద్ధిమతులలో నడుచుక వత్తురు. అటుగనక నియ్యోగులు యేరీతున నడిపిస్తే ఆరీతున నడుచును. నియ్యోగులతో ద్వివిధమైతే దొరనుండి తమ ప్రాణాలకు హానియై దొరతనమునకున్ను చలనం వచ్చును. అటుగనక యేకగ్రీవమై ఆమూడు తెగల నియ్యోగులున్ను ఆలోచన శేసుక నడిపించే కార్య మని తెలిపి "వారు స్వాయత్తులు గారు, పరాయత్తులు గాని స్వామివారు ఉభయాయత్తులు కాబట్టి దేవరవారి ఆలోచనకు సరిలేదు. తురకలు మూడు తెగలవారున్ను యేకాలోచన పరులై కార్యముఖానకు నడిపిస్తే లక్షయాభై వేలగుర్రాలున్ను వెయింన్నే నూరుమదహస్తులున్ను మూడులక్షలపాయుదళములున్ను. వార్లను జయించేటందుకు అంతకన్నా ద్విగుణమైనబలముచేత జయించవలెను. కర్నాటకాన అన్నిగుర్రములున్ను సంతరించేమా కాదు. చతురంగబలాలున్ను వుండవలెననేటందులకు కైజీతం గుర్రాలు పండ్రెండువేలున్ను, అమరనాయకం గుర్రాలు యిరువైనాలుగువేలున్ను, కైజీతం యేనుగులు యాభైఘట్టాలును, అమరపు యేనుగులు నూటయిరువైఘట్టాలు, కైజీతం రాణువ నూతనంసహాగా మూడులక్షలున్ను, అమరం వగను అయిదులక్షలున్ను, బలంబంట్లున్ను యీామట్టుబలముతోనున్ను వివరంమీద సమరమిస్తేను తురకల కార్యమనగా యెంత" అని విన్నపం శేయగా రాయలవారు సామాజికులలోను ధైర్యమువల్లనున్ను లక్ష్మీ కటాక్షమువల్లనున్ను దైవసహాయమువల్లనున్ను జయంగలుగును, అందుకు

శ్లో॥ యతో ధైర్య స్తతో లక్ష్మీః యతో లక్ష్మీ స్తతో హరిః
యతో హరి స్తతో ధర్మః యతో ధర్మ స్తతో జయః॥

అని పెద్దలు చెప్పుదురు గనక అన్నిటికిన్ని ధైర్యము ముఖ్యముగనక మీరు ధైర్యశాలులు మీరు పూనినకార్యములన్నిన్ని చేకూడును. యేనుగులున్ను గుర్రాలున్ను కాల్బలమున్ను కారణం గాదు. దైవసహాయమువల్లనే రాజ్యములు దీవులు పరిపాలించవలెను. తొల్లి ఆరుగురు చక్రవర్తులు తాామువున్న తావుననెవుండి గదా ఆజ్ఞాచక్రముచేత సప్తద్వీపములున్ను యేలిరి. ఆపిమ్మట పదార్గురు రాజులున్ను భూమి పరిపాలించిరి. ఆరీతినే స్వామివారికి వెంకటేశ్వరుల సహాయం గలదు" అని తెలుపగా విన్నవారై "ముందరికార్యాలోచనకు అనుసారిగా నడిపించుడా" అని అప్పాజి మొదలైనవారితో ఆనతిచ్చి ఆయాదిక్కులనుండి వేగర్లు కమ్మ కాకి

తములు తెచ్చినారా అని పరామరిశించగా అహముదానగరాన నుండ్డిన్ని వేగుల రామున్ను గోలకొండనుండిన్ని వేగుల గోపాజిన్ని వచ్చినారని తెలుపగా, వద్దనున్న వార్లను కడకు నంపించి వేగర్లను రప్పించుక అచ్చటి సమాచారములు అడుగగా వారు విజయనగరమున నుండిన్ని తరలిన దారభ్యం అహముదా

అహమ్మదాబాదు గోల కొండల వృత్తాంతము పరదేశులశోధనము.

నగరం గోలకొండ ప్రవేశమయ్యేపర్యంత్యం నిత్యపయ గతుల ప్రూళ్లున్ను పట్టణములున్ను దాటి ఆయానరుదులు న్ను పరస్థలం శీమవారినిన్ని పరదేసులనున్ను మరిన్ని మార్గస్థులుగావచ్చేవారినిన్ని శోధించేదిన్ని కస్తుకాగిత ములు లేనివార్లను యెక్కడినుండి వస్తునావు, యెవరి తెగల వారు అని బెదరించి అడిగేదిన్ని, ఆతర్వాత పొమ్మనేదిన్ని, ఆపట్టణములోనికి బోయి వెలిపాళ్యములు జూచి కోటలోనికి పోయ్యేటప్పుడు యెరుకగలవారు వచ్చి వీరు తమవారనిన్ని వీరినుండి వకకార్యము వస్తే మేము నేరస్తులమనిన్ని భరవస ముగా చెప్పిన తర్వాత శిఖామీద శిఖా వేసి కోటలోపలికి అంపుదురు. కడమ జనులవారికి ఆశిఖా జూపితేను కోటలోనికి విడుతురు. కొత్తవాలు అనేతలారికి ఆముద్రజూపి పట్టణములో సంచరించవలెను. కోటలో వుండేదినాళ్లెల్ల తిరిగి తమశీమకు వచ్చేటప్పుడు మొదటి పారుబత్యగానితో యెరుకజేసి పారుబత్య గాని శిఖా చేతికిచ్చి శిఖావేయించుకొని కొత్తవాలు అనేతలారికి జూపికోట వాకిళ్లకువచ్చి వాకిటివార్లకున్ను ఆముద్ర జూపినతర్వాత అంపుదురు. అటు వంటి దుర్ఘటనములనన్నిన్ని నేర్పున గడచి దివాణం ముందర దిన మొక్కుం

తురుష్కరాజ్యములో దండనవిధము.

టికి ఆజ్ఞలుచేశేదిన్ని, నడిమికి తెగవేశేదిన్ని, రంపాన మను ష్యుల గోసేదిన్ని, గోనెలో మనుష్యుల వేసిగట్టి యినుప గుదియల గొట్టేదిన్ని, చాలకు శింగ్గాణికొనల నారుల తగిలించేదిన్ని, రెండు తులాలబరువుగల రాళ్లు కాళ్లకుగట్టి పాడుగోడలకు యిరుగడల దిగవేశేదిన్ని, మూటకట్లుగాకట్టి యెండ్డలో దొర్లించేదింన్ని, కాలు చేయి కర్న నాశిక ఛేదనం జేశేదిన్ని, ఇదిగాక శీమ మణియగార్లను అనేకవిధముగా బాధలు బెట్టేదిన్ని, యేనుగ కాలగట్టి దొర్లించేదిన్ని, యీరీతిగా అనేకవిధములుగా చూడ భీకరమైన బాధలకు వెరచి నగరికి పైకం యిస్తే ప్రాణాలతో విడుతురు. యిచ్చేటందుకు అవకాశం లేకుంట్టే హింసచేతనే నడిపీధిలోనే చంపుదురు. యీరీతి యానబెట్టె బాధలుచూస్తావుండి వెంబడినే ఆయాధిపత్యము నగరి మహాలుకు ముందర యెదు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

## (TELUGU ACADEMY.)

## ప్రమాదీచనామసంవత్సరకార్యనివేదనము.

### సభ్యులు.

ఈసంవత్సరమందు శ్రీ భద్రాచల సంస్థానాధిపతులగు శ్రీ రాజా పార్థసారథి అప్పారావు బహద్దరుగారు పరిషత్పోషకులైరని విన్నవింపఁ గలిగినందు కెంతయు సంతసించుచున్నారము. యావజ్జీవసభ్యులలో నొకరు కాలధర్మము నొందిరి. అయిదుగురు క్రొత్తగాఁ జేరిరి. నేఁటి యావజ్జీవసభ్యులసంఖ్య 29.

సంవత్సరమధ్యమున నూతనముగ 97 గురు సాధారణ సభ్యులుచేరిరి. ప్రాఁతసభ్యులలో 40 మంది చందాలనీయక పోవుటచే వారిపేరులు తొలఁగించుట యైనది. కావున వర్షాంతమందున్న సభ్యులసంఖ్య 174. ముగ్గురుసభ్యులఁ గ్రొత్తగాఁ జేర్చినందున నిప్పటి గౌరవార్థసభ్యులసంఖ్య 29 యై యున్నది.

ప్రథమ ద్వితీయ తృతీయ సంవత్సరాంతములందుండిన సభ్యులసంఖ్య నీ క్రిందఁ జూడవలయును.

| | ప్రథమసంవత్సరాంతమున | ద్వితీయసంవత్సరాంతమున | తృతీయసంవత్సరాంతమున |
|---|---|---|---|
| ప్రతిష్ఠాపకులు | 2 | 2 | 2 |
| పోషకులు | 5 | 5 | 6 |
| యావజ్జీవసభ్యులు | 25 | * 25 | 29 |
| సాధారణసభ్యులు | 58 | 117 | 174 |
| గౌరవార్థసభ్యులు | ,, | 26 | 29 |
| | 90 | 175 | 240 |

## కార్యనిర్వాహకసభ.

గతవార్షికసభలో వేమవరపు రామదాసుపంతులుగారు, తాడూరి లక్ష్మీనరసింహారావుపంతులుగారు—వీరిద్దఱిని సభ్యులుగాఁ జేర్చుట యైనది. మఱియు వేదము వేంకటరాయశాస్త్రిగారు తమ కార్యదర్శిత్వమును వదలుకొన్నందున వారికిబదులు నెమలి పట్టాభిరామారావుపంతులుగారిని కార్యదర్శిగాను, శ్రీవేంకటగిరి మహారాజావారిని సభాపతిగను ఆసభయందే యేర్పాటు చేయుటయైనది.

## ఆ య వ్య య ము లు.

గతసంవత్సరమందు రు 25055-2-2 వసూలైనవి. ప్రతిష్ఠాపకులియ్యవలసిన ధనమంతయు నిచ్చివేసినారు. పోషకులవలన రు 2800 లు, యావజ్జీవసభ్యులవలన రు 1715 లు, సాధారణసభ్యులవలన రు 324 లు, అనఁగా మొత్తము రు. 4839 రావలసియున్నది. ఇందులో రు 130 లు పిదప వసూలయినవి. కావున నేఁటివఱకు రు 4709 లు రావలసియున్నది.

ఆయము.

సంవత్సరారంభమున మన మనుకొన్నదానికంటె వ్యయము తగ్గినది. ముఖ్యముగా నిఘంటువునుగుఱించిన వ్యయము తక్కువయైనది. అంతకంటె నధికధనము వ్యయపఱచుట కవకాశము లేకుండెను. పుస్తకము లచ్చువేయించుపని యీసంవత్సరమునం దగును.

వ్యయము.

* పరీధావికార్యనివేదనములో 26 అనివేయుట పొరపాటు.

ఆయవ్యయముల వివరణ మీఁ క్రిందఁ జూడనగును.

| ఆయము. | | |
|---|---|---|
| పిఠాపురము రాజాగారు నిఘంటు నిర్మాణమునకొసఁగిన విరాళము. | | 2000-0-0 |
| ప్రతిష్ఠాపకుల చందాలు | | 19000-0-0 |
| పోషకుల చందాలు | | 2000-0-0 |
| యావజ్జీవ సభ్యుల చందాలు | | 285-0-0 |
| సాధారణ సభ్యుల చందాలు | | 843-4-0 |
| విరాళము | | 12-0-0 |
| పత్రిక చందాలు | | 333-0-0 |
| పత్రికల క్రయము | | 75-0-0 |
| వి. పి. కర్చుల జమ | | 56-15-0 |
| చిల్లర ఆదాయములు | | 0-8-0 |
| బాడుగల వలన జమ | | 33-8-11 |
| అడ్వాన్సు ముజరా | | 75-0-0 |
| గవర్నమెంటు పత్రములమీఁద వడ్డి | | 340-14-3 |
| జమ మొత్తము | | 25,055-2-2 |
| సంవత్సరాదిని నిలువ:— | | |
| మదరాసు బాంకులో | 660-4-0 | |
| ఆఫీసులో | 210-15-0 | 871-3-0 |
| మొత్తము | | 25,926-5-2 |

| వ్యయము. | | |
|---|---|---|
| జీతములు | | 887-15-11 |
| చిల్లర అచ్చుకూలి | | 136-7-0 |
| పుస్తకభాండాగారము (అచ్చుపుస్తకములు) | | 233-14-0 |
| వ్రాఁతపుస్తకముల సంపాదించిన యిద్దఱి జీతములు బత్తెములు | | 356-8-2 |
| ప్రయాణపు ఖర్చు బత్తా | | 141-11-9 |
| అడ్వాన్సు | | 25-0-0 |
| రిజిస్ట్రేషను, ఆడిటరు ఫీసు | | 100-0-0 |
| ఆఫీసు బాడుగ | | 275-0-0 |
| పోస్టేజి | | 78-3-6 |
| కాగితములు కలములు వగైరా | | 44-7-11 |
| చిల్లర కర్చులు | | 121-3-7 |
| కుర్చీలు వగైరా సామానులు | | 93-14-0 |
| హెచ్చు వసూలు వాపసు | | 4-12-0 |
| పత్రిక కాగితములు | 270-14-0 | |
| డిటో అచ్చుకూలి | 375-7-0 | |
| డిటో చిత్తరువులు | 66-12-0 | |
| పత్రిక పోస్టేజి | 158-11-3 | 871-12-3 |
| నిఘంటుజీతములు పండితులకు | 686-3-9 | |
| డిటో అచ్చుకూలి | 26-8-0 | |
| డిటో చిల్లర కర్చు | 5-2-0 | 717-13-9 |
| మొత్తము | | 4,088-11-10 |
| నిలువ-గవర్నమెంటు పత్రములు 3½% | 10000-0-0 | |
| ఫిక్సెడు డిపాసిట్టు | 7500-0-0 | |
| మద్రాసు బాంకులో | 4238-8-6 | |
| ఆఫీసులో | 99-0-10 | 21,837-9-4 |
| మొత్తము. | | 25,926-5-2 |

గుళ్లపల్లి నరసింహము.

ఆడిటరు.

నెమలి పట్టాభిరామరావు.

పురాణము నాగభూషణము.

ఆచంట లక్ష్మీపతి.

జాయంటు సెక్రెటేరీలు.

## పరిషత్సర్వాదాయము.

నేఁటివఱకుఁ బరిషత్తునకు రు. 47,267-10-5 లు విలువగల యాస్తి యున్నది. ఇందులో రు. 21,837-9-4 లు రొక్కము. తాటియాకుపుస్తకముల వెల రు. 18000 లు అచ్చుపుస్తకములు కలసి పుస్తకభాండాగారము వెల రు. 18,677-13-0 లు, మిగిలినది కుర్చీలు, బల్లలు, బీరువాలు, నిలువయున్న కాగితములు మొదలగువాని విలువ.

ఇందులవివరణ మీక్రిందిపట్టికవలనఁ దెలియును.

| | | | | |
|---|---|---|---|---|
| I. పరిషత్తు జనరల్ ఫండు. | | I. పరిషత్తు జనరల్ ఫండు. | | |
| చిల్లరబాకీలు | 335-13-5 | 3½% గవర్నమెంటు పత్రములు | 10000-0-0 | |
| ఫండు నిల్వ | 44931-13-0 | మద్రాసు బ్యాంకులో ఫిక్సెడు డిపాసిట్టు | 7500-0-0 | |
| | | మద్రాసుబ్యాంకిలో నిల్వ | 3026-6-3 | |
| | | ఆఫీసులో నిల్వ | 99-0-10 | |
| | | ఆఫీసులో స్టాంపులు | 0-9-0 | |
| | | | | 20626-0-1 |
| | | వసూలు కావలసిన చందాలు | 4839-0-0 | |
| | | వసూలు కావలసిన వీపీలు | 24-14-0 | |
| | | కుర్చీలు వగైరాసామానులు (3½% మినహాయించఁగా) | 247-14-0 | |
| | | కాగితములు | 87-0-0 | |
| | | పత్రికలు (25% మినహాయించగ) | 672-0-0 | |
| | | పుస్తకభాండాగారము (10% మినహాయించగా) | 677-13-0 | |
| | | తాటాకు పుస్తకములు (వ్రాత ప్రతులు సుమారు విలువ) | 18000 0-0 | |
| | | | | 24548-10-0 |
| | | రివిన్యూగోష్వారా దాఖలానష్టము | | 93-1-4 |
| | 45267-10-5 | మొత్తం | | 45267-10-5 |
| II. పరిషత్తు నిఘంటుఫండు | 2000-0-0 | II. పరిషత్తు నిఘంటు ఫండు. | | |
| | | నిఘంటు లెక్క దాఖలా | 787-13-9 | |
| | | మద్రాసు బాంకిలో నిల్వ | 1212-2-3 | |
| | | | | 2000-0-0 |
| | 47267-10-5 | మొత్తం | | 47267-10-5 |

గుళ్లపల్లి నరసింహము.
ఆడిటరు.

నెమలి పట్టాభిరామరావు.
పురాణము నాగభూషణము.
ఆచంట లక్ష్మీపతి.
జాయింటు సెక్రెటరీలు.

## పరిషత్పత్రికాప్రకటనము.

గతసంవత్సరము మూఁడుమాసముల కొకసంచికచొప్పున నాలుగుసంచికలు వెలువడినవి. ముద్రణశాలలో జరిగిన యాలస్యమునుబట్టి కొన్నిసంచికలు సకాలమున వెలువడఁజాలనందులకుఁ జింతిల్లుచున్నాము. స్వీయమగు ముద్రణయంత్రము లేనపుడు కాలవిలంబమును దప్పించుకొనుట కష్టసాధ్యముగాఁ గనుపట్టుచున్నది. నేఁటివఱకు వెలువడిన యాఱుసంచికలయందుఁ బ్రకటింపఁబడిన వ్యాసములశీర్షికలును, వ్యాసకర్తలపేళ్లును 3 వ యనుబంధమునఁ గనవచ్చును. తొలుత నిర్ణయించుకొనినదానికంటె నధికముగ సంచికకు నూఱుపుటలకుఁ దక్కువకాకుండ విలువగల కాగితములపై నచ్చువేయించుచున్నారము. పరిషత్సభ్యులు గాక పత్రికకు చందాదారులు సంవత్సరారంభమున 41 మందిమాత్రమే యుండిరి. ఇప్పుడు 124 గురు గలరు.

ఈపత్రికలోఁ బ్రకటించుటకై తామ్రశాసనములు దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, మొక్కపాటి సుబ్బారాయఁడుగారు, టేకుమళ్ల అచ్యుతరావుగారు, ఆచంట వేంకటసుబ్బరాయఁడుగారు నిచ్చియున్నారు. వారికి వందనము లొనర్చుచున్నారము.

ఏలూరునకుసమీపమందున్న నాయుడుగూడెములో వ్రాఁతడబ్బులు కొన్ని దొరకినవి. వానిని బరీక్షించి యవి చాళుక్యరాజులనాఁటి నాణెములనియు, నేడవ క్రైస్తవశతాబ్దమునఁ బుట్టి యుండవచ్చుననియు మదరాసు మ్యూజియం అధికారిగారు వ్రాసినారు. ఇట్టిశాసనములు నాణెములు నెవరికైన లభించినయెడలఁ బరిషత్తునకుఁ బంపవలయునని వేఁడుచున్నారము.

## పుస్తకభాండాగారము.

గతసంవత్సరము 153 ముద్రితపుస్తకములును, 1318 లిఖితపుస్తకములును సంపాదితములైనవి. వీనితోఁ గలసి యిప్పుడు 358 అచ్చుపుస్తకములును, 1697 వ్రాఁతపుస్తకములును గలవు. అచ్చుపుస్తకములలో నిప్పుడు సాధారణముగ వెలకు దొరకనట్టియు దేశచారిత్రభాషావిషయ పరిశోధన కధికోపయోగకరము లగునట్టియు నపూర్వగ్రంథములు పెక్కులుగలవు. వర్తమాన గ్రంథకర్తలు తమగ్రంథముల నొక్కొక్కప్రతిచొప్పునఁ బరిషత్తున కిచ్చెదరేని కృతజ్ఞతాపూర్వకముగ నందికొందుమని యిందుమూలముగా విన్నవించుచున్నారము. వ్రాఁతపుస్తకములలో భారతసంపుటములు 447 ఉన్నవి.

వ్రాఁతపుస్తకములు.

వ్రాఁతపుస్తకములను సంపాదించుటకు దేవగుప్తాపు భరద్వాజముగారిని, యస్. రంగనాథరావుగారిని నియమించుటయైనది. భరద్వాజముగారు గోదావరీకృష్ణాజిల్లాలయందును, కొంచె

ము కాలము కమ్మంమెట్టు, ఓరంగల్లు పట్టణములందును సంచరించి యనేకగ్రంథములేగాక పలువురుసభ్యులను, బత్రికకుఁ జందాదారులను సంపాదించిరి. రంగనాథరావుగారును శ్రద్ధతోఁబనిచేసి కడప, చిత్తూరుమండలములలో ననేకపుస్తకములను సంపాదించిరి. ఈగ్రంథముల నన్నిటి నిప్పుడు కాగితముమీఁద వ్రాయింపవలయుననిన రు 18000 లకుఁ బైఁగాఁబట్టును. తాటియాకుపై వ్రాయఁగలవారున్నచో వారెంత యడుగుదురో తెలియదు. ఈగ్రంథములన్నియు ద్రవ్యము తీసికొనకయే పరిషత్తునకొసఁగిన భాషాభిమానుల కివే యనేక కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచున్నారము. అధికపుస్తకముల నిచ్చినవారలపేరులు 4 వ యనుబంధమునఁ గనవలయును.

ఈనడుమువచ్చిన 447 సంపుటములకుఁ దప్ప తక్కిన సంపుటములకు—అనఁగా 1250 సంపుటములకుఁ బట్టిక సిద్ధముగానున్నది. ఈ పుస్తకములఁ బరిశోధించి వానికి సవిస్తరమగు పట్టిక (Descriptive Catalogue) ముందుఁ బ్రకటింపవలసియున్నది. శిథిలముగానున్న ప్రతులలోని గ్రంథము కాగితముమీఁద వ్రాయింపవలసియున్నది.

దేశచరిత్ర సంబంధవిషయములఁగూర్చి దొరతనమువారేఁటేఁటఁ బ్రకటించు నుత్తరువులు (Reports of the Archæological Department), దక్షిణహిందూదేశశాసనములు (South Indian Inscriptions) అను గ్రంథములను వెలనీయనక్కఱలేకయే యింతటినుండి మనపరిషత్తున కిచ్చునట్లాజ్ఞనొసంగి యిప్పుడు సిద్ధముగానున్న యుత్తరువులను బుస్తకములను దయచేసియున్నారు.

పుస్తకములుగాని వార్తాపత్రికలుగాని యిష్టమున్నవారు వచ్చి చదువుకొనుట కవకాశము కల్పింపఁబడియున్నది.

## నిఘంటు నిర్మాణము.

పరిభాషాపదసంపాదనము.

నిఘంటు నిర్మాణపద్ధతి నిర్ణయించుట కొక యుపసంఘ మేర్పడెనని పూర్వసంవత్సర కార్యనివేదనమువలన మీకుఁ దెలిసియే యున్నది. ఆసంఘుసభ్యులు గతసంవత్సరమధ్యమున సమావేశమై జయంతి రామయ్యగారివ్యాసములో నుపపాదితమైన పద్ధతిప్రకారమే నిఘంటు రచింపవలయుననియుఁ దదంగముగా భారతప్రయోగానుక్రమణిక (Verbal Concordance of the Bharata) నొకదానిని గూర్చుటయు, నాంధ్రదేశమం దాయామండలములందు వివిధములగు వృత్తులయందు వాడుకలోనున్న పరిభాషాపదములను సంపాదించుటయు నను నీరెండుపనులు ప్రథమమున జరగవలసినవనియుఁ దీర్మానించిరి. ఆతీర్మానముప్రకారము పరిభాషా

పదములు వ్రాసి తెచ్చుట కాంధ్రాంగ్లేయ భాషాపరిజ్ఞానముగల హోతా వెంకటకృష్ణయ్యగారిని నియమింపఁగా నాయన శ్రీకాకుళమందారంభించి యిప్పటికి నెల్లూరువఱకునుగల ముఖ్యపట్టణములకుఁ జని యందు వాడుకలోనున్న శబ్దముల నెత్తి వ్రాసియున్నారు. ఇతరప్రదేశముల కీసంవత్సరము పోవలసియున్నది. పరిశీలింపఁగా నిప్పుడు వ్యవహారములో 66 వృత్తు లున్నట్లేర్పడినది. ఈవృత్తులపేళ్లను, వానికి సంబంధించినపదముల నెత్తి వ్రాయుటలో గమనింపవలసిన నియమములును 1-వ యనుబంధములోఁ జూడనగును.

భారతప్రయోగానుక్రమణిక.

భారతమం దేశబ్ద మేపర్వమున నేయాశ్వాసములో నెన్నవపద్యమందుఁ బ్రయోగింపఁబడినదో తెలుపుట యే భారతప్రయోగానుక్రమణిక ప్రయోజనము. ఇట్టిగ్రంథము లాంగ్లేయాదిభాషలలో నున్నవి కాని మనదేశభాషలం దింతవఱకు నెక్కడ నున్నటులఁ దోచదు. ఈ యనుక్రమణిక నిఘంటువులో నుదాహరింపవలసిన భారతప్రయోగవాక్యముల సుకరముగ వెదకుట కుపకరించుట యేగాక, భారతప్రయోగదర్పణముగఁ బండితుల కత్యంతోపయోగకరముగాఁగూడ నుండును.

1. బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారు,
2. ,, మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు,
3. ,, దండిగుంట సూర్యనారాయణశాస్త్రులుగారు,
4. ,, శ్రీపాద నరసింహశాస్త్రులుగారు,
5. ,, పురాణము సూర్యనారాయణతీర్థులుగారు,

అను నీయైదుగురుపండితులు నీపనిఁ జేయుచున్నారు. నేఁటివఱకు, ఆది, భీష్మ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు, ఆరణ్య, విరాటపర్వములలోఁ గొంత భాగమును నైనవి. వర్తమానసంవత్సరమందుఁ దక్కినపర్వములఁ బూర్తి చేయుట యేగాక వ్రాసినదంతయు నేకముఖముగావించి గ్రంథరూపముగా సమకూర్పవలసియున్నది. ఇందుకుఁ దగిన యేర్పాటులు చేయఁబడును. అనుక్రమణికా సంఘటనము విషయమైన నియమములు 2-వ యనుబంధమునఁ జూడనగును.

వర్తమాన వర్షమందుఁ బూర్వోక్తకార్యముల రెంటిని నెఱవేర్చుట యే గాక, యాంధ్రగ్రంథములఁ జదివి యేశబ్ద మేసందర్భమున నేయర్థమందుఁ బ్రయోగింపఁబడినదో సోదాహరణముగ వ్రాయుటకును, బదముల వ్యుత్పత్తుల నరయుటకును దగిన విద్వాంసుల నియమింపవలసియున్నది. ఈపనులన్నియు నేకకాలమందే జరగుటకుఁ దగిన యేర్పాటులు చేయఁబడును.

ఈనిఘంటు నిర్మాణమునకై మదరాసుదొరతనము వారు పరిషత్తున కీసంవత్సర మిరువదివేలరూపాయల నీయ నిశ్చయించినారు. ఈ యౌదార్యము దొరతనమువారికి దేశభాషలయందుఁ గలవాత్సల్యమును మనపరిషత్తునందుఁ గల విశ్వాసమును జాటుచున్నది.

## గ్రంథప్రకటనము.

భీమనఛందస్సను నామాంతరముగల "కవిజనాశ్రయ" మను నముద్రితచ్ఛందోగ్రంథమును బ్రకటించుటకై పరిషత్పుస్తకభాండాగారమునందును, రాజకీయ లిఖితపుస్తక భాండాగారమందును గలతాటియాకుప్రతులఁ బరిశోధించి పాఠభేదములతో శుద్ధప్రతియొక్కటి వ్రాయఁబడినది. గ్రంథము శీఘ్రముగా ముద్రింపఁబడును. ఈగ్రంథము వాదీంద్రచూడామణి యను జైనాచార్యుని శిష్యుఁడును, శ్రావకాభరణ, కవిజనాశ్రయబిరుదాంకితుఁడును, మల్లయకుమారుఁడును నగు రేచన రచియించినట్లు భీమకవి రచించె నని యున్నది. కర్ణాటకద్రావిడభాషల యందు జైనులచే రచియింపఁబడినగ్రంథము లనేకము లున్నవి. తెనుఁగునందు జైనసంబంధము గలగ్రంథ మింతవఱకు నిది యొక్కటియే కన్పట్టుచున్నది. కృష్ణరాయని రాజ్యకాలమందుఁ గర్ణాటరాజ్యస్థితిగతులను దెలియఁజేయు రాయవాచక మనువచనగ్రంథ మొకటి దక్షిణదేశమున దొరకినది. దేశచారిత్ర విమర్శనమునకుపకరించునది యగుటచే నందలి చరిత్రాంశములు స్పష్టముగాఁ దెలియునటుల టిప్పణముతోఁగూడఁ బ్రకటింపఁ దలఁచినారము. మూలమచ్చగుచున్నది. శ్రీనాథకృత మనివ్యవహరింపఁబడుచున్న పల్నాటి వీరచరిత్ర మనుద్విపదప్రబంధములో స్వల్పభాగము అక్కిరాజు ఉమాకాంతముగా రిదివఱలో నచ్చువేయించి యున్నారు. అచ్చుకావలసినగ్రంథము చాలనున్నది. దీనిప్రతి యొకటి సంపాదితమైనది. ఇదియు పాల్కురికి సోమనాథకృతగ్రంథ మొకటియు నీ సంవత్సరము ప్రకటింపఁబడును. పల్నాటివీరచరిత్రప్రకటనమునకుఁ గావలసినధన మంతయు శ్రీ పిఠాపురమురాజుగా రీయ నిశ్చయించినారని చెప్పుట కెంతయు సంతోషించుచున్నారము.

## గద్యగ్రంథరచన.

భారత భాగవత రామాయణగ్రంథముల సారము సర్వసామాన్యముగ నందఱకుఁ దెలియునట్లు సలక్షణముగ సులభశైలిని వ్రాయించి ప్రకటింపవలయునని కార్యనిర్వాహకసంఘమువారుచేసిన నిర్ణయముప్రకారము రామాయణసారము వావిలికొలను సుబ్బరావుగారును, భాగవతసారము కేతవరపు వేంకటశాస్త్రులుగారును వ్రాయఁబూని వ్రాయుచున్నారు. ఈ రెండుగ్రంథములుకూడ నీసంవ

త్సరమున వచ్చును. భారతసారరచనకుఁ దగిన యేర్పాటులుకూడ శీఘ్రముగఁ జేయఁబడును.

## గ్రామ్యవాదము.

పాఠశాలాంత్య పరీక్ష (School Final Examination) కుఁ బోవువిద్యార్థులాంధ్రవచనరచన సలక్షణభాషనైనను గ్రామ్యభాషనైనను యథేచ్ఛముగా వ్రాయవచ్చునని తత్పరీక్షావిధి నిర్ణాయకసంఘము (School Leaving Certificate Board) వారు చేసిన యేర్పాటును రద్దుచేయింపవలయు నను నుద్దేశముతో మదరాసు దొరతనము వారికి మనవిపత్రము పంపఁబడి యుండెనని పరీధావి సంవత్సర పరిషత్కార్య నివేదనమునందుఁ జెప్పియుంటిమి కదా! దానిపర్యవసాన మింతవఱకుఁ దేలలేదని నుడువుటకుఁ జింతించుచున్నారము. గతసంవత్సరమునం దీవిషయమై వార్తాపత్రికాముఖమున చర్చ యధికముగా జరుగుటయే గాక రావు సాహేబు గిడుగు రామమూర్తిగారు గ్రామ్యవాదమును బురస్కరించుకొని నవీ

వాదప్రతివాదములు.

నాంధ్రము (Modern Telugu) అను శీర్షికతో నొక వ్యాసమాంగ్లేయభాషలో వ్రాసి ప్రకటించిరి. దీనికిఁ బ్రత్యుత్తరముగ జయంతి రామయ్యపంతులుగారు గ్రాంధికాంధ్రభాషాసమర్థనము (A defence of Literary Telugu) అను శీర్షికతో నొక వ్యాసము రచించి ప్రకటించిరి. ఈవాద మిట్లు జరుగుచుండఁగాఁ బాఠశాలాంత్యపరీక్షా విషయకమయిన పూర్వోదాహృత నిబంధనమును నిషేధించి రద్దుచేయవలయునని

విద్యాధికారిగారికి మనవి.

సహేతుకముగఁ గోరుచుఁ బరిషత్కార్యనిర్వాహక సభ వారు విద్యాధికారిగారికి 1913 సంవత్సరము సెప్టంబరు నెలలో నొక విజ్ఞాపనపత్రము నంపఁగాఁ బరిషదభిప్రాయముల నంగీకరించుట కెంతమాత్రము నవకాశము లేదని యాయనగారు ప్రత్యుత్తర మొసఁగిరి. మఱికొన్ని దినములకు, మఱియేభాషలోను లేని యీప్రాచీన నవీనభాషావిభాగ మొక్కయాంధ్రభాషయందుమాత్రము చేయుట భాషాసంప్ర

శాసన నిర్మాణ సభా వృత్తాంతము.

దాయమునకును, శాస్త్రమునకును, లోకమునకును విరుద్ధము గాన నాభేదమును గల్పించిననిబంధనమును రద్దుచేయునట్లు విద్యాధికారిగారి కుత్తరువు లీయవలయుననియు నీయర్థమును వివరించి యనువదించుట కవకాశము కావలయుననియుఁ బరిషత్కార్య నిర్వాహకసభ్యులలో నొక్కరగు గౌరవనీయ బయ్యా నరసింహేశ్వర శర్మగారు దొరతనమువారిని వేఁడిరి. ఈవిషయమై 1913 సంవత్సరము నవంబరునెలలో సమావేశమైన శాసననిర్మాణసభలో సవిస్తరముగఁ జర్చజరిగినది. ఆసమయమున గౌరవనీయులగు 1. మోచెర్ల రామచంద్రరావుగారు 2. ఏ.

యస్. కృష్ణారావుగారు 3. షి. శేశవపిళ్లగారు 4. నరసింహరాజుగారు 5. టి. వి. శేషగిరిఅయ్యరుగారు 6. వి. యస్. శ్రీనివాసశాస్త్రులుగారు వీరలందఱు నరసింహేశ్వర శర్మగారు ప్రతిపాదించిన యర్థమునే యేకగ్రీవముగ దృఢపఱిచిరి. వీరిలో శ్రీనివాసశాస్త్రులుగారు నిషిద్ధనిబంధనము పుట్టిన సమయమందుఁ దన్నిబంధనకర్తలలో నొకరుగానుండిరి. గ్రాంథికభాషవలెనే గ్రామ్యభాషకూడఁ బాఠశాలలలో బాలురకు నేర్పుచున్నారని యెవరో చెప్పఁగా నది నమ్మి (School Leaving Certificate) సంఘమువారా నిబంధనము చేయుట తటస్థించినదనియు, నిటీవల విచారింపఁగా గ్రామ్యభాషను బాఠశాలలలోఁ జెప్పుటలేదని తమకు నిశ్చయముగఁ దెలిసినది గావున ఆనిబంధన మవశ్యము నిషేధనీయమనియు వారు ప్రతిపాదించిరి. ఆసభలో వీరివాదమును ఖండించి గ్రామ్యవాదమును సమర్థించినవా రెవ్వరును లేకపోయిరి. అప్పుడు విద్యాధికారిపదము నధిష్ఠించి యున్న (Sir Alfred Bourne) గారు నరసింహేశ్వరశర్మగారు కోరినప్రకార మొనర్చుటకెంతమాత్ర మవకాశము లేదని తొలుత వాదించిరిగాని, చిట్టచివర కాయభిప్రాయమును మార్చుకొని మధ్యమపరీక్షాంధ్రవచనరచనాపద్ధతి నిర్ణయించుటకు విశ్వవిద్యాలయమువారిచే నియమింపఁబడిన సంఘము (University Intermediate Examination Telugu Composition Committee) వారు ఆవిషయమును గురించి చర్చించుచున్నారనియు, శీఘ్రకాలమునందే వారియభిప్రాయము తేలఁగలదనియు, నది తేలినపిమ్మట నాపద్ధతియే పాఠశాలాంత్యపరీక్షకుఁ గూడ వర్తించునట్లు త్తరువు చేసెదమనియుఁ జెప్పుటచే నాచర్చ యంతటితో నంతరించెను.

<table>
<tr><td>మధ్యమ పరీక్షాంధ్ర వచనరచన నిర్ణాయకసంఘము.</td><td>గతవర్షమున రాజమహేంద్రవరములో సమావేశమైనపరిషత్సభలో మధ్యమపరీక్షాంధ్రవచనరచన సంఘమునుగూర్చి చర్చించి యాసభలోని సభ్యుల నియామకము బాగుగ నుండలేదనియు, భాషాభిజ్ఞుల మఱికొందఱఁ జేర్పవలెననియు విశ్వవిద్యాలయమువారిని గోరవలసినట్లు తీర్మానమై యాప్రకారము వారిపేర వ్రాయుట జరిగినది; గాని యందువలన ఫలమేమియుఁ గలుగలేదు. పిదపఁ గొన్నినాళ్లకాంధ్రలోకమున కంతకు నత్యంతము సంబంధించిన యిట్టి భాషావిషయమును విమర్శించుసభలోఁ దమదేశమువారి యభిప్రాయముఁ దెల్పుటకుఁ దమ దేశస్థులఁ గొందఱి సభ్యులఁగా నియమింపవలయు నని దత్తమండల (Ceded Districts Union) సమాజము వేఁడినమీఁదట విశ్వవిద్యాలయకార్యనిర్వాహక సంఘము (The Syndicate) వారామనవి నంగీకరించి మఱి నలుగురు సభ్యులం జేర్చిరి. వీరితోఁ గలసి పదునలుగురు సభ్యులయిరి. వారెవ్వరనఁగా—</td></tr>
</table>

1. గుమ్ముడూరు వెంకటరంగారావుగారు, ఎం.ఏ.,
2. కొమర్రాజు లక్ష్మణరావుగారు, ఎం.ఏ.,
3. వేదము వెంకటరాయశాస్త్రులుగారు.
4. జయంతిరామయ్యగారు, బి.ఏ., బి.ఎల్.,
5. కోలాచలము శ్రీనివాసరావుగారు.
6. టి, శంకరలింగంపిళ్లగారు, బి.ఏ., బి.ఎల్.,
7. నాగపూడి కుప్పుస్వామయ్యగారు, బి.ఏ.,
8. కె. సుబ్బారెడ్డిగారు బ్యారిష్టరు, బి.ఏ.,
9. పి. టి. శ్రీనివాసయ్యంగారు ఎం.ఏ.,
10. గురుజాడ అప్పారావుగారు, బి.ఏ.,
11. రావుసాహెబు గిడుగు రామమూర్తిగారు, బి.ఏ.,
12. బుర్రా శేషగిరిరావుగారు, ఎం. ఏ.,
13. రావుబహద్దరు మాలూరు రంగాచార్యులుగారు, ఎం.ఏ.,
14. R. W. రాసుగారు.

ఈ సభ్యులందఱుం జేరి కొన్ని తీర్మానములఁ జేసి వానిని విశ్వవిద్యాలయ కార్యసంఘము వారియొద్దకుఁ బంపియున్నారు. ఆసంఘమువారావిషయమును బరిశీలించి యింకను దీర్పు చెప్పియుండలేదు. ఈ తీర్మానములలోఁ గొన్నిటికి సభ్యులందఱు నంగీకరించినట్లును మఱికొన్నిటి కల్పసంఖ్యాకు లగు కొంద ఱాక్షేపించినట్లును దెలియుచున్నది. విద్యాలయసభవారి తీర్మానమింకను బ్రకటింపఁబడి యుండనందున నీవిషయ మిచ్చటవిస్తరించి చర్చించుట కవకాశము లేదు.

## దేశభాషా సేవ.

మధ్యమోత్తమ పరీక్షలకు (Intermediate and B. A. Examinations) దేశభాషాగ్రంథపఠన మైచ్ఛికముగాని యవశ్యముగాదని యూనివర్సిటీ సభవారు చేసిననిర్ణయము దేశభాషాభివృద్ధికి హానికరము గావున దానిని మార్పించుటకుఁ బ్రయత్నములు జరగుచున్నవని పూర్వసంవత్సర కార్యనివేదనము నందుఁ దెలియఁజేసియుంటిమి. ఈప్రయత్నములు కొంతవఱకు ఫలించినవని చెప్పఁగలిగితి మని సంతోషించుచున్నారము. గతించిన మార్చినెల 21 తేదియందు సమావేశమైన యూనివర్సిటీసభలో నీవిషయ మిట్లు తీర్మాన మయినది.

యూనివర్సిటీవారి తీర్మానము.

అదియెట్లనఁగా:—మధ్యమపరీక్షకు (Intermediate Examination) వచనరచనకు సహాయముగాఁ గొన్ని దేశభాషాగ్రంథములు చదువవలసినదనియు నుత్తమపరీక్ష (B. A. Examination) కభ్యసింపవలసిన విషయ విభాగములలో 4 వ విభాగము

లోఁ దర్కమునకు బదులుగాను, 5 వ విభాగములో విశేషచరిత్రగ్రంథములకు బదులుగాను, 6 వ విభాగములో మఱియొక విషయముతోఁ జేర్చియు దేశభాషాగ్రంథములు విద్యార్థులకిష్టమైనచోఁ జదువవచ్చుననియుఁ దీర్మానించిరి. దేశభాషాభివృద్ధి కింతమాత్రము చాలునని తోఁచదు. మధ్యమపరీక్షకు నియమింపఁబడు గ్రంథములలో వేఱె పరీక్షయుండదు గావున నాగ్రంథములు విద్యార్థులు సవిమర్శముగఁ జదువ నవసరముండదు. ఆధునిక గద్యగ్రంథములుమాత్రమే వచనరచనకుపకరించునని యెంచినచో, భాషాజ్ఞానమున కత్యంతావశ్యకము లగుపూర్వకవికృతగ్రంథములు చదువ నక్కఱలేకయేపోవును. ఉత్తమపరీక్షలో దేశభాషాగ్రంథములను చదువుటయుఁ జదువ కుండుటయు విద్యార్థుల యిచ్ఛాధీనమైయున్నది. క్రిందితరగతులలోనైన మాతృభాష చక్కఁగ నభ్యసింపకున్న నింతమాత్రపు మార్పులవలన లాభమంతగా నుండదు. కాని యిప్పటి కింతటితోఁ దృప్తి నొంది యుండవలసినదే.

పాఠశాలలలోఁ గావలసినమార్పులు.

పాఠశాలాంత్యపరీక్షకుఁ బోవువిద్యార్థులు కూడఁ బ్రస్తుతము దేశభాషాగ్రంథములు చదువనక్కఱయేలేదు. కాని యింతటినుండి యావశ్యకముగాఁ జదువవలసినట్లీనడుమ తీర్మానమయినట్లు వినుచున్నారము. ఇది శుభవార్త. పాఠశాలాశ్రేణు లన్నిటిలోను దేశభాషాగ్రంథపఠన మవశ్యకర్తవ్యముగాఁ జేయుటయేగాక యంత్యపరీక్షలో నుత్తీర్ణుఁ డగునప్పటికి విద్యార్థి కనర్గళమయిన మాతృభాషాజ్ఞాన మేర్పడునట్లా పైతరగతులకు నియామకమైన మాతృభాషాజ్ఞానపరిమితి హెచ్చింపవలయును. అట్లు చేసినఁగాని బాలురకు మాతృభాషాజ్ఞానము చక్కఁగాఁ గుదురదు. అట్లొనర్చినచో మీఁదితరగతులందు దేశభాషాసేవ నైచ్ఛికము చేసినను లోటుండదు. పూర్వపుఁ బల్లెటూరు బడులలో బాలురకు భారతాదిగ్రంథములు వినువారి కర్థమగునట్లు రాగయుక్తముగఁ జదువుట నేర్పెడువారు. ఇప్పుడన్ననో డిప్టీకలెక్టరుపదవికి యత్నించువారుకూడ వేమనశతకములోఁ బరీక్ష యిచ్చి యందుమూలమునఁ దమ మాతృభాషాజ్ఞానమును స్థాపించుకొనవలసినవారైనారు! హస్తలిఖితపత్రములం జదివెడియభ్యాస మింగ్లీషు నభ్యసించువారిలో లేదనియే చెప్పవచ్చును. ఇది మిక్కిలి విషాదకరము.

దేశభాషాభివృద్ధికి మార్గములు.

దేశభాషాభివృద్ధి చేయుట యవశ్యమా? అయినచో దానికి మార్గమేది? యనువిచారము మనకుమాత్రమేగాక కొందఱాంగ్లేయులకును గలిగినది. ఈనడుమ నీవిషయమై కొందఱు విద్యాధికు లగునాంగ్లేయు లీదేశమునందును ఇంగ్లాండునందును గూడ నుపన్యాసములమూలమునను వార్తాపత్రికాముఖమునను జర్చించియున్నారు.

మనదేశమం దాంగ్లేయవిద్యాభ్యాసమారంభము కాకమునుపు దేశీయవిద్యలు ముఖ్యమా లేక యాంగ్లేయవిద్యముఖ్యమా యనునంశ మప్పటి రాజకీయోద్యోగులు చర్చించి మెకాలే దొర (Lord Mecaulay) గారి యభిప్రాయానుసారముగ నాంగ్లేయభాషయు దానిమూలమున నితరవిద్యలును రాజకీయపాఠశాలలలో నేర్పవలసినట్లు నిర్ణయించిరి. ఆపద్ధతి నేఁటివఱకుఁ బ్రచారములోనున్నది. సంస్కృతభాషయందును, దేశభాషలందును గల గ్రంథములు పుక్కిటి పురాణములనియు, వానిలో విశ్వసనీయములగు నంశము లేమియు లేవనియు, గావున నాగ్రంథములు చదువుటవలన వృథాకాలక్షేపమేగాని లాభము లేదనియు మెకాలేదొరగారభిప్రాయపడిరి. ఈయభిప్రాయము పొరపాటునఁ గలిగినదేగాని న్యాయముగాదనియుఁ, బ్రాచీనవిద్యలు సంస్కృతభాషయం దిమిడియుండుటచే నాభాష యత్యంతోపయోగకరమనియు, నాంగ్లేయభాషావ్యాప్తి యధికమగుటచే దేశీయవిద్యలు చాలమట్టు కడుగంటెనవనియు నిటీవల నీభరతఖండమునందేగాక ఖండాంతరమందుఁగూడఁ బలువు రెంచుచున్నారు. అన్నివిద్యలు దేశభాషల మూలముననె నేర్పుట మేలనియు నందుకుఁ దగిన దేశీయవిశ్వవిద్యాలయముల నచ్చటచ్చట నిర్మింపవలసినపనియుఁ గొందఱమతము. ఇప్పుడున్న యేర్పాటులలో మార్పు లేమియుఁ గాఁగూడదని మఱికొందఱ యభిప్రాయము. సమబుద్ధితో నీ రెండుమతములఁ బరిశీలించిచూడ దేశభాషలను దేశీయవిద్యలను వృద్ధిచేయుట యావశ్యకమనియు, నాంగ్లేయభాషాభ్యాసము గూడ నావశ్యకమే యనియుఁ జెప్పక తప్పదు. విద్యలలోఁ గొన్ని ప్రాచీనములనియు మఱికొన్ని నవీనములనియు విభాగింపవచ్చును. ప్రాచీన విద్యలకు సంబంధించిన గ్రంథములన్నియు నీదేశమందు సంస్కృతభాషయందేపుట్టి వానిలోఁ గొన్ని దేశభాషలలోనికిఁ బరివర్తనము కాఁబడియున్నవి. ఈ విద్య లన్నియు నీకాలమున ననుపయోగములని చెప్పుటకవకాశము లేదు. కావున స్వదేశ సాంప్రదాయముల నెఱుఁగుటకా గ్రంథము లవశ్యపఠనీయములు. ఇటీవల నూతనవిద్యలనేకములు పాశ్చాత్యదేశములందుఁ బుట్టియున్నవి. నానాఁటికిఁ బుట్టుచున్నవి. ఈ విద్యలనభ్యసించుటకు ముఖ్యసూత్ర మాంగ్లేయభాష. ఈకారణమునను రాజభాషయగుటనుగూడ నీభాష మనకభ్యసనీయము. ఈ భాషలోని గ్రంథములను దేశభాషలలోనికిఁ బరివర్తనము చేసి క్రమక్రమముగ నాభాషల వృద్ధిచేసినయెడల నవివృద్ధిపొందును. అందుకుఁ దగినప్రయత్న మేమఱక యిప్పటినుండియుఁ జేయుచుండవలయును. ప్రస్తుతస్థితినిబట్టి చూడఁగాఁ బాఠశాలాంత్యశ్రేణివఱకును గల క్రిందితరగతులలో నాంగ్లేయభాషకుఁ బ్రస్తుతముగల గౌరవము కొంచెము తగ్గించి, దేశభాషాపరిశ్రమము హెచ్చగున ట్లేర్పాటు చేయవలయును. పైపరీక్షల కాంగ్లేయభాషాపరిశ్రమమే ముఖ్యముగా నుండవచ్చును.

## ఆంధ్రభాషాభిమానము.

ఆంధ్రదేశమునం దిటీవల నుత్సాహక్రియాశక్తు లుద్భవిల్లి నానాఁటికి వృద్ధినొందుచున్నవి. ఈ శక్తులు మితిదప్పి నిరంకుశము లై పోక యుక్తముగా వినియోగింపఁబడినచో దేశమునకు శుభప్రదము లగుననుటకు సందేహము లేదు. దేశాభిమాన మనేకముఖములుగాఁ బ్రసరించును. వానిలో భాషాముఖ మగ్రగణ్యము. దేశభాషాభిమానము లేక దేశాభిమానము గలుగదు. కలిగినను నిలువదు. కావున భాషావిషయమై కూడ మనదేశమం దనేకయత్నములు జరుగుచుండుట సంతోషకరము. ఆంధ్రవార్తాపత్రిక లధిక మగుచున్నవి. ఇదివఱలో వారమున కొకసారి వెలువడుచున్న యాంధ్రపత్రిక యిప్పుడు దినదినము వెడలుచున్నది. ఇది యధిక వ్యయప్రయాసములచేఁ గాని సాధ్య మగుపని కాదు. ఆంధ్రవిజ్ఞానసర్వస్వముగూడ నట్టిదే. ఇదిగాక, యనేక నూతనగ్రంథము లచ్చుటచ్చుట బయలుదేఱుచున్నవి. పెద్దలకుమాత్రమే గాక పిన్నలకుఁగూడఁ దగినపుస్తకములు బయలుదేఱుచున్నవి. ఇది యెంతయుఁ బ్రశంసనీయము. తెలుగుపుస్తకములు చిన్నయక్షరములతోఁ బలుచని కాగితములమీఁదఁ దప్పుల తడికలుగా ముద్రించునభ్యాస మిప్పటికిని బొత్తిగా నిలిచిపోలేదు. పెద్దయక్షరములతో దళసరికాగితములమీఁద నిర్దుష్టముగా ముద్రించినంగాని, గ్రంథములు పాఠశాలలోఁ బఠనార్హములు కావు. ఇంతియకాక దేశమం దనేకప్రదేశముల నానాఁటికి బయలుదేఱుచున్న పుస్తకభాండాగారములు వర్ధమాన విద్యాసక్తిని బ్రకటించుచున్నవి. అచ్చటచ్చట 58 పుస్తకభాండాగారము లున్నట్లు తెలియవచ్చుచున్నది. ఏతద్విషయమై ముందుఁ జేయఁదగిన కార్యముల నిర్ణయించుటకీనడుమ బెజవాడలో నొక్క మహాసభకూడ జరగియున్నది. చెన్నపట్టనమందలి యాయుర్వేద మహాపాఠశాలయందు సంస్కృతమురాని యాంధ్రవిద్యార్థులకుఁ దెలుఁగుననే వైద్యవిద్య నేర్పుట కేర్పాటీనడుమఁ జేయఁబడినది. గౌరవనీయులగు శ్రీపానుగంటి రామారాయనింగారు తెలుఁగున నాధునికశాస్త్రసంబంధగ్రంథముల రచింపించుటకై పదివేలరూపాయలు యూనివర్సిటీవారిమూలమున నిచ్చియున్నారు. ఇదివఱలోఁ దెలుఁగులో మాటలాడుటకును వ్రాయుటకును జంకువారిప్పుడు నిరాతంకముగ నుపన్యసించుచున్నారు. గ్రంథములు వ్రాయుచున్నారు. ఇంతవఱకు నేదో యొక ప్రతిబంధకముచే నడఁగియున్న శక్తి యాయడ్డము తీరఁగనే వెలువడినట్లు తోఁచుచున్నది. ఇట్లు బహుముఖములుగ నుద్భూతమైయున్న యీభాషాభిమానప్రవాహము సద్వినియోగమై శుభసస్యములఁ గూర్చుఁగాత!

జయంతిరామయ్య,
కార్యనిర్వాహకసభాధ్యక్షుఁడు.

నెమలి పట్టాభిరామరావు.
పురాణము నాగభూషణము.
ఆచంట లక్ష్మీపతి.

# అనుబంధములు.

## 1-వ యనుబంధము.

### వృత్తులు.

| | |
|---|---|
| 1. (a) వ్యవసాయము=(కృషి.) | Agriculture. |
| (b) తోఁటలు, వనములు పెంచుట. | Gardening. |
| 2. కట్టెలుకొట్టుట, బొగ్గులు కాల్చుట. | Wood cutting and charcoal making. |
| 3. పశువులను పెంచుట. | Cattle breeding. |
| 4. కోళ్లు నెమిళ్లు మొదలైనవానిని పెంచుట. | Poultry breeding. |
| 5. గ్రుడ్లను పొదుగుట. | Hatching eggs. |
| 6. పందులను పెంచుట. | Pig breeding. |
| 7. గొల్లవృత్తి. | Sheep and goat breeding. |
| 8. (a) జాలరి లేక పల్లివృత్తి. | The occupation of fishermen. |
| (b) పడవలు నడుపుట. | Boat playing. |
| 9. (a) మృగములవేఁట. | Hunting wild beasts. |
| (b) పక్షులను బట్టుట. | Catching birds. |
| 10. జూదము. | Gambling. |
| 11. ప్రత్తిపట్టుట, దూదేకుట. | Cotton ginning and cleaning. |
| 12. (a) ఉన్ని యేకుట, వడకుట. | Wool carding, spinning and weaving. |
| (b) కంబళ్లు, తివాచులు నేయుట. | Manufacture of blankets and carpets. |
| 13. త్రాళ్లు, మోకులు, పగ్గములు వేయుట. | Rope making, &c. |
| 14. మాదిగవృత్తి, తోళ్లసరకులుచేయుట. | Manufacture of leather and leather. articles. |
| 15. వడ్రము, పెట్టెలు మొదలైనవి చేయుట, ఇండ్లుకట్టుట యిత్యాదులు. | Carpentry. |
| 16. మేదరపని. | Basket making. |
| 17. కమ్మరము. | Occupation of blacksmith, making articles of iron. |
| 18. కంచరము. | Making articles of brass, copper and bell metal. |
| 19. కమసాలిపని. | Occupation of gold and silversmith. |
| 20. కుమ్మరిపని (కుమ్మరాటకము) | Pottery. |
| 21. తెలుకులపని. | Oil manufacture. |
| 22. బియ్యముదంచుట, పిండివిసరుట. | Rice pounding and rice grinding. |
| 23. పంచదార, బెల్లమువండుట. | Sugar manufacture. |
| 24. సారాయికాచుట. | Arrack manufacture and distilling. |
| 25. కల్లుగీయుట, (ఈడిగవృత్తి.) | Drawing toddy. |
| 26. పాగాలుచుట్టుట. | Making turbans. |

| | |
|---|---|
| 27. కుట్టుపని. | Tailoring. |
| 28. బుటేదారీపని. | Embroidery. |
| 29. గొడుగులు బెత్తములు చేయుట. | Making umbrellas and canes. |
| 30. చాకలిపని. | The occupation of a washerman, laundry. |
| 31. అద్దకము లేక వర్ణములు వేయుట. | Dyeing. |
| 32. మంగలిపని. | The profession of a barber. |
| 33. సైరంధ్రీవృత్తి. | Toilet business. |
| 34. పచ్చపొడుచుట. | Tattoeing. |
| 35. ఒడ్డె లేక ఉప్పరవృత్తి (మట్టిపని) | Excavation and well-sinking. |
| 36. ఱాయి మలచుట (కాసిపని). | Sculpture. |
| 37. తాపీపని. | Brick laying and doing chunam and cement work. |
| 38. ఇండ్లనేత. | House roofing. |
| 39. చిత్రలేఖనము-నుచ్చుపని. | Painting and drawing pictures. |
| 40. రత్నములతోఁ బనిచేయుట. | Working in precious stones. |
| 41. మలామాపని. | Guilding. |
| 42. గాజులుచేయుట. | Making bangles. |
| 43. విగ్రహములుచేయుట. | Making idols. |
| 44. రోడ్లువేయుట వంతెనలుకట్టుట. | Laying roads and constructing bridges. |
| 45. బండితోలుట. | Cart driving. |
| 46. గోడలుమొదలైనవి పెట్టుట. | Building walls, &c. |
| 47. వడ్డీవ్యాపారముచేయుట. | Money lending. |
| 48. కలపవర్తకము. | Trade in wood and timber. |
| 49. మందులవ్యాపారము. | Preparation and selling drugs and medicines. |
| 50. బాణసంచా. | Manufacture of fire works. |
| 51. పూటకూళ్లవృత్తి. | Inn (Hotel) keeping. |
| 52. చిల్లరయంగడి పెట్టుట. | Purveying and selling sundry articles and victuals. |
| 53. మిఠాయిపని. | Sweetmeat manufacture. |
| 54. నల్లమందు గంజాయి వీనివ్యాపారము. | Trade in opium and ganja. |
| 55. కుంకుమ పసుపు దువ్వెనలు మొదలగునవి యమ్ము దాసరివృత్తి. (బుక్కా). | Dealing in ready made articles of toilet such as saffron, turmeric, combs, &c. |
| 56. బొమ్మలు చేయుట. | Manufacture of toys and dolls. |
| 57. తలారివృత్తి. | Village watchman's profession. |
| 58. పౌరోహిత్యము. | Priesthood. |
| 59. పూజారివృత్తి. | Temple service. |
| 60. వైద్యవృత్తి. | Medical profession. |

| | |
|---|---|
| 61. పల్లుకట్టుపని. | Dentists art. |
| 62. ముద్రణవ్యాపారము. | Printing. |
| 63. బడిపంతులు పని. | Teaching Profession. |
| 64. నాట్యము అభినయము. | Dancing and acting. |
| 65. వండుట నీళ్లు మోయుట. | Cooking and water Carrying. |
| 66. గారడి వృత్తి. | Jugglery. |

ప్రతివృత్తికిని నాలుగువిధముల పారిభాషికపదములు సంపాదింప వలసియుండును. అవి యేవి యనిన:—

1. ఆయావృత్తులలో నుపయోగపడు పదార్థముల (Raw materials) పేరులు.
2. ఆపదార్థములతోఁ జేయుక్రియావిశేషముల (Processes of Manufacture) పేరులు.
3. ఆయాక్రియలు చేయుట కుపకరించెడు సాధనముల లేక పనిముట్ల (Instruments) పేరులు.
4. పైనుదహరింపఁబడిన సాధనసామగ్రిచేఁ జేయఁబడిన సరకుల (Finished articles) పేరులు.

ఇందుకుదాహరణముగా మొదటఁ గృషియనువృత్తిని బుచ్చుకొందము.

దీనికిఁ గావలసిన పదార్థములెవ్వియన, భూమి, విత్తనములు, ఎరువులు, మొదలగునవి. వీనిని వివరించునపుడు రేగడ గరప మొదలగు భూవిశేషములను, వివిధములగు నెరువుల పేళ్లను, విత్తనముల పేళ్లను ఇత్యాదులు వ్రాయవలసియుండును. క్రియావిశేషములక్రింద-దున్నుట, విత్తుట, వెదచల్లుట, గొర్తినివేయుట, నాటుట, కలుపుదీయుట యీ మొదలగు పనుల పేరులు వ్రాయవలయును. పనిముట్లక్రింద-అరక, మేడి, కఱ్ఱు, గొఱ్ఱు, జడ్డిగపిడత యిత్యాది సాధనముల పేళ్లు వ్రాయవలయును. ఫలితవస్తువులు లేక సరకులక్రిందఁ గృషివలనఫలించు ధాన్యాదుల పేరులు వ్రాయవలెను. ధాన్యముల పేళ్లను విత్తనముల పేళ్లను సమము గనుక ధాన్యములక్రింద నే వ్రాయవలయును.

ఈప్రకారమే కమసాలివృత్తినిగుఱించి వ్రాయునపుడు, అందు కుపకరించెడు పదార్థముల క్రింద—వెండి, బంగారు, టంకము, వెలిగారము మొదలగు వస్తువుల పేళ్లు వ్రాయవలయును. క్రియావిశేషములక్రింద- కరఁగుట, సాఁగఁగొట్టుట, కమ్మెచ్చునఁదీయుట యిత్యాది క్రియల పేరులు వ్రాయవలయును. పనిముట్లక్రింద- దాగలి, సుత్తి, కమ్మెచ్చు, కుంపటి, గొట్టము మొదలగు వస్తువుల పేళ్లు వ్రాయవలయును. తయారైన లేక చేయఁబడిన వస్తువులక్రింద నగల పేళ్లు వ్రాయవలయును.

ఈప్రకారమే యన్నివృత్తులకు వ్రాయవలయును.

1. ఈ నాలుగువిధములకంటె నధికవిధములశబ్దము లున్నయెడల నవికూడ వ్రాయవలెను.
2. ఆయావృత్తులకు సంబంధించిన శబ్దముల నన్నింటిని సమగ్రముగఁ దెలిసికొనవలయును.
3. ఏవృత్తికి సంబంధించిన యేవిధములోఁ జేరినశబ్దములు పట్టికయందు వ్రాయఁబడునో, ఆవృత్తి పేరును, ఆవిధము పేరును పట్టికమీఁదిభాగమున వ్రాసికొనవలయును.
4. వస్తువివరణ మనుగడిలో, ఆయావస్తువులయొక్క స్వరూపమును దెలుపునట్టి సంగ్రహవాక్యము (brief description) వ్రాయవలయును.

5. వస్తువుపేరు అనుదానిక్రిందనుండు గళ్లలో నాయాగ్రామములలో నాయావస్తువులకుఁ గలపేళ్లు వరుసగ వ్రాయవలెను. ఆయా గ్రామముల పేరులు పైగళ్లలో వ్రాయవలయును.
6. ఒకవస్తువున కనేకభేదములున్నప్పుడు, భిన్నపదార్థముల పేళ్లన్నియు వ్రాయవలయును.
ఉదా:—కత్తియనునది సామాన్యవాచకము. ఇందు, మంగలికత్తి, కలముచెక్కుకత్తి, కోడికత్తి, తరవారుకత్తి, యిత్యాదిభేదము లనేకములున్నవి. ఈభిన్నపదార్థముల వివరణము మొదటిగడిలో వ్రాసి పేళ్లు తరువాతిగళ్లలో వ్రాయవలెను.
7. అక్షరములు విడివిడిగాను,స్పష్టముగాను,స్ఫుటముగాను మంచిసిరాతో వ్రాయవలయును.
8. ఒక్కొక్క వృత్తికి సంబంధించినమాటలు వ్రాయునపుడు ఆవృత్తియందుఁ దెలివిగాఁ బనిచేయుచున్న యిద్దఱు ముగ్గురు మనుష్యులను దెలిసికొని వ్రాయవలయును. ఒకరికిఁ దెలియనిమాటలు మఱియొకరివల్లఁ దెలిసికొనవచ్చును. ఒకరియుచ్చారణము స్పష్టముగా నుండనియెడ, నితరుల యుచ్చారణమును బట్టి శబ్దస్వరూపమును దెలిసికొనవచ్చును. కావున నొక్కనివలననేగాక యిద్దఱుముగ్గురివలన శబ్దములను దెలిసికొనుట మంచిది.
9. సాధారణముగాఁ బామరులు మనకుఁ గావలసినపదములన్నియు నొక్కసారి జ్ఞప్తికిఁ దెచ్చుకొని చెప్పఁజాలరు. వారిని గ్రుచ్చి గ్రుచ్చి యడిగి కావలసిన పదములను సంపాదింపవలెను.
10. పామరుల యుచ్చారణము సాధారణముగ స్పష్టముగానుండదు. అపు డొక్కమాటనే రెండుమూఁడుసారులు పలికించి సరియైన యుచ్చారణమును దెలిసికొనవలయును. వారు చెప్పిన మాటలను జెప్పినటులనే వ్రాయవలయును గాని తప్పుగానున్నవని దిద్దవలదు.
11. ఒకప్పు డొకశబ్దమునకే వివిధస్థలములలో వివిధరూపములుండును.
ఉదా:—బాడిద, బాడిదె, బాడిది, బాడిస, బాడిసె, బాడిసి.

ఇందులో నేగ్రామములో నేరూపము వాడుకలో నున్నదో యాగ్రామముక్రింద నారూపమునే వ్రాయవలయును.

"బాడిద" అనుపదములో 'ద' యందుండు "అ"కారమును గొందఱు "అ"కాక "ఎ"కాక యీరెంటికి నడుమ నుండునట్లుగా, అనఁగా "*at*" అను నింగ్లీషుపదములోని "*a*" వలె నుచ్చరింతురు. అట్టి యుచ్చారణమును వ్రాయవలసివచ్చినపుడు "బాడిద" అని వ్రాసి దాని ప్రక్కనుగాని క్రిందఁగాని (అ=a in *at*) అని వ్రాసి దానికిఁ గుండలీకరణము చేయవలయును.

12. ఒకవస్తువునకే యొక్కస్థలమందే నామభేదము లున్నపక్షమునను, ఒక్కపదమునకే యొక్కస్థలమందే రూపభేదము లున్నపక్షమునను, ఆయానామముల రూపముల నన్నింటిని వ్రాయవలయును.

---

## 2-వ యనుబంధము.

### శ్రీమదాంధ్రభారత ప్రయోగానుక్రమణిక కూర్పవలసిన పద్ధతుల వివరణము.

ఈయనుక్రమణిక 1909-వ సంవత్సరమం దానందముద్రాక్షరశాలయందు వెలువడిన ప్రతి ననుసరించి కూర్పవలయును.

2. పద్యములకును వచనములకును పదవిభాగముచేసి యందున్న పదముల నన్నిటిని గళ్లుగీచిన కాగితముపై నొక్కొకగడిలో నొక్కొకపదము చొప్పున నొకదానిక్రింద నొకటి యథాక్రమముగా స్పష్టముగాఁ దెలియునటుల విడియక్షరములతో నల్లసిరాతో వ్రాయవలెను. ఆయాపదములక్రింద నేపద మేపర్వమునం దేయాశ్వాసములో నేపద్యమునం దున్నదో తెలియునటుల పొడియక్షరములతోను, అంకెలతోడను నీక్రిందఁ గనపఱచిన రీతిని గుర్తులు వేయవలెను.

1. ఉ. | చఱచి. ఆ. 2.67. |

2. ఉ. | అడరఁగ స. 1.31. |

ఇందు మొదటియుదాహరణములో గుఱుతునకు ఆదిపర్వమునందు రెండవయాశ్వాసములో నరువదియేడవ పద్య మని యర్థము. ఆప్రకారమే రెండవ యుదాహరణములోని గుఱుతునకు సభాపర్వము మొదటియాశ్వాసమునందు ముప్పదియొకటవ పద్యమని యర్థము. ఈప్రకారముగా నన్నిస్థలములందు వ్రాయవలెను.

ఆయాపర్వముల పేళ్లకు బదులుగా పొడియక్షరము లీక్రిందవివరించిన ప్రకారము వ్రాయవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదిపర్వము | ... ఆ. | | సౌప్తికపర్వము | ... సౌ. |
| సభాపర్వము | ... స. | | స్త్రీపర్వము | ... స్త్రీ. |
| అరణ్యపర్వము | ... అర. | | శాంతిపర్వము | ... శా. |
| విరాటపర్వము | ... వి. | | అనుశాసనికపర్వము | ... అను. |
| ఉద్యోగపర్వము | ... ఉ. | | అశ్వమేధపర్వము | ... అశ్వ. |
| భీష్మపర్వము | ... భీ. | | ఆశ్రమవాసపర్వము | ... ఆ. వా. |
| ద్రోణపర్వము | ... ద్రో. | | మౌసలపర్వము | ... మౌ. |
| కర్ణపర్వము | ... క. | | మహాప్రస్థానికపర్వము | ... మ. |
| శల్యపర్వము | ... శ. | | స్వర్గారోహణపర్వము | ... స్వ. |

3. ఒక్కొక్కపద మొక్కొక్కగదిలో వ్రాయవలెను. అట్లిముడనియెడల రెండుమూఁడు గదులలోఁగూడ వ్రాయవచ్చునుగాని యొకగదిలో రెండుమూఁడు పదములుమాత్ర ముండఁగూడదు.

4. ప్రత్యయాంతములగుపదములు ప్రత్యయాంతములుగానే వ్రాయవలెను. ఉ. ఒడంబడితి, వచ్చుటంజేసి ఇత్యాదులు.

5. సమాసము లేకపదములుగా గ్రహింపవలయును.

6. ఒడంబడితి అనునది ఒడంబడితిని అనిగాని ఒడంబడితివి అనిగాని కావచ్చును. మధ్యమపురుషముగా నున్నప్పుడు పదాంతమున కుండలీకరణము (brackets) చేసి దాని మధ్యమున (వి) యనియు, ఉత్తమ పురుషమైనప్పుడు (ని) యనియు వ్రాయవలెను.

ఉ. ఒడంబడితి (వి).

ఒడంబడితి (ని).

ఈప్రకారమే యితర పదములకును.

7. చేసి, పొంటె, కోలె, పై, పెయి మొదలగు ప్రాచీన విభక్తిప్రత్యయములు, ఉన్ మొదలగు సముచ్చయార్థకములు, కాన్, కన్, కాఁగన్ అను క్రియావిశేషణములు, ఇత్యాదులతోఁ గూడినపదములు వచ్చినప్పుడు ప్రత్యయసహితములగు పదములనే వ్రాసి యాపదములపై యాయాప్రత్యయముల శీర్షికలుగా వ్రాయవలెను.

ఉ. $\frac{\text{కన్}}{\text{మనఁగన్}}$, $\frac{\text{ఉన్}}{\text{అంతయున్}}$

8. దానికి నీవొడంబడితి. ఇత్యాదిస్థలములందు ఛందోభంగము కానియెడల దానికిన్ + ఈవు అని యీవిధముగా పదవిభాగము చేయవలెను.

9. భగ్నులుగాన్. ఇత్యాది స్థలములం దర్థవంతములయిన కాన్, కన్ అనునవి ప్రత్యేక పదములుగా గ్రహింపఁబడవలసినది.

మనఁగన్ అనుచోట కన్ అనునది అనుప్రయుక్తము గాన ప్రత్యేకపదముగా వ్రాయఁగూడదు.

10. అవధారణార్థమందువచ్చు అ, ఎ, ఇత్యాదులును, సందేహార్థమందువచ్చు ఒ, ఒకో, ఇత్యాదులును, ఆశీరాద్యర్థములందువచ్చు కాత, త, ఎడు మొదలగునవియు, వికల్పార్థమందు వచ్చు ఏని, ఏన్, మొదలగునవియు, ప్రశ్నార్థమందువచ్చు ఏ, ఆలును ఆయాశబ్దములపై శీర్షికలుగా వ్రాయఁబడవలెను.

11. ఆచ్ఛికశబ్దముల కర్థభేదమున్నప్పుడు విశేషార్థములఁ బ్రకరణానుసారముగ పదము కుడిభాగమున = అను గుర్తు వ్రాసి ప్రతిపదార్థమును వ్రాయవలెను.

12. వినరయ్యా, రావమ్మ, తక్కొరుఁడు, వచ్చుచుండుదురు, లేదయ్యెడు, కాఁడయ్యె ఇత్యాదు లేకపదములని యెంచవలయును.

13. 'మాతలి పాణిగ్రహణం
బాతనిఁజేయించి.'

ఇత్యాదిప్రయోగవిశేషములను, ఛందోవిశేషములను వేఱుగా నొకకాగితముపై యెత్తి వ్రాయవలెను.

14. ఆశ్వాసము ముగిసినప్పుడు పదపటియాశ్వాసము వేఱుకాగితముమీఁద నారంభింపవలెను.

15. ప్రకృతి సరళవర్ణములు స్థిరవర్ణములు పరమగునప్పుడును, వాక్యాంతమందును ద్రుతము లోపించును. అట్టియెడలఁ బదచ్ఛేదములలో దానినిగనఁబఱుపనక్కఱలేదు.

ఇతరస్థలములందు, అనఁగా స్వత్వసంశ్లేషానుస్వారరూపములుగా మాఱినప్పుడు పదచ్ఛేదములలో ద్రుతమును జూపవలయును.

ఉదాహరణము.

వచ్చెగంగాధరుఁడు = వచ్చె + గంగాధరుఁడు

వచ్చెభూసురుఁడు = వచ్చె + భూసురుఁడు.

వాఁడువచ్చె = వాఁడు + వచ్చె.

ఈస్థలములందు ద్రుతమును జూపనక్కఱలేదు.

| | |
|---|---|
| వచ్చెఁ గమలాక్షుఁడు<br>వచ్చెంగమలాక్షుఁడు<br>వచ్చెన్గమలాక్షుఁడు | = వచ్చెన్ + కమలాక్షుఁడు. |

వచ్చెను గమలాక్షుఁడు = వచ్చెను + కమలాక్షుఁడు.

16. విదురుండై పుట్టి, పరాజితులై ఇత్యాదిస్థలములందు 'ఐ' యనునది ప్రత్యేకపదముగ గ్రహింపఁబడవలయును.

17. జాదంబాడు, పోరాడు, మాటాడు, ఏపారు, పాలుపారు, మేలుకొను, కూరుచుండు, తనరఁజేయుచున్, ఒడంబడవలయున్, ఆనతిచ్చి యిత్యాదు లేకపదములు.

18. నివర్తింపఁబడు, ఇత్యాదులలో <u>పడు</u>

రాఁగల, ఇత్యాదులలో <u>కల</u>

చేసికొను, ఇత్యాదులలో <u>కొను</u>

ఈ మొదలగు ననుబంధముల పదముల పై శీర్షికలుగాఁ జూపవలెను.

19. ఆచ్ఛిక మిశ్ర సాధ్య సమాసములను దొలుత నేకపదములుగాఁ జూపి యావెంబడినే భిన్నపదములుగఁ గూడఁ గనఁబఱుపవలయును. పదచ్ఛేదము చేయునప్పు డున్నరూప మున్నట్లు చూపవలయును. సాధ్య మిశ్ర సమాసములలోఁ జేరియుండు సిద్ధసమాసభాగముల నేకపదములఁగనే చూపవలయును.

ఉదాహరణము.

| | |
|---|---|
| ఆచ్ఛికసమాసము - చెఱువునీరు | 1. చెఱువునీరు.<br>2. చెఱువు.<br>3. నీరు. |
| సాధ్యసమాసము - తటాకంబుజలము | 1. తటాకంబుజలము.<br>2. తటాకంబు.<br>3. జలము. |
| మిశ్రసమాసములు - ఈయనిభూమిపతులు | 1. ఈయనిభూమిపతులు.<br>2. ఈయని.<br>3. భూమిపతులు. |

అక్కథకుండు { 1. అక్కథకుండు. 2. అ. 3. కథకుండు. }

నీతనయుఁడు { 1. నీతనయుఁడు. 2. నీ. 3. తనయుఁడు. }

ఈప్రకారము వ్రాయవలయును " ఈయనిభూమిపతులు" అన్నచో, భూమి + పతులు అని విభజింపనక్కఱలేదు.

20. "మహినొప్పు సర్వలోకాశ్రయుఁడు" ఇచ్చట 'ఒప్పు' అనునది సమాపకక్రియగాని విశేషణముకాదని తెలుపుటకు 'ఒప్పు' (ౕ) అని నకారము కుండలీకృతముచేయవలెను.

---

## 3-వ యనుబంధము.

### పరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసములు, తత్కర్తలు.

1. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రయోజనము.-చెన్నాప్రగడ భానుమూర్తిగారు, బి.ఏ.,
2. ఆంధ్రమహాకవిప్రశంస.-శతావధానులు, తిరుపతి వేంకటేశ్వరకవులు.
3. ఆంధ్రభాష.-మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.
4. దేశచరిత్రస్వరూపప్రయోజనములు.-జయంతి రామయ్యగారు, బి ఏ., బి.ఎల్.,
5. చాలుక్యరాజరాజు నందంపూడి శాసనము.-జయంతి రామయ్యగారు, బి.ఏ., బి.ఎల్.,
6. ప్రకృతిశాస్త్రములు, వానియభివృద్ధి.-ఏచూరి నరసింహముపంతులుగారు, ఎం.ఏ.,
7. ఆంధ్రగద్యపద్యకావ్యములు.-నాగపూడి కుప్పుసామయ్యగారు, బి.ఏ.,
8. ప్రాచీనాంధ్రవచనకావ్యములు.-వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.
9. కవిగీతము.-వేంకటపార్వతీశ్వరకవులు.
10. ప్రకృతిశాస్త్రములు.-ఏచూరి నరసింహముగారు, ఎం.ఏ.,
11. రంజనకిరణములు.-వేమూరి విశ్వనాథశర్మగారు, ఎం.ఏ.,
12. గుణగవిజయాదిత్యుని, ఉరుటూరుశాసనము.-జయంతి రామయ్యగారు, బి.ఏ., బి.ఎల్.,
13. గ్రామ్యాదేశనిరసనసభ.-వేమూరి విశ్వనాథశర్మగారు, ఎం.ఏ.,
14. నవీనసంవత్సరము.-మంగిపూడి వేంకటశర్మగారు.
15. శుక్రనీతిసారము.-పురాణపండా మల్లయ్యశాస్త్రులుగారు.
16. శ్రీమహాభారతాంధ్రీకరణ విమర్శనము.- శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు.
17. కావ్యగీతము.-వేంకటపార్వతీశ్వరకవులు.
18. ద్రావిడభాషాపంచకనిరూపణము.-(౧వ భాగము) మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.
19. అరవదేశమునందలి యాంధ్రవాఙ్మయము.-అక్కిరాజు ఉమాకాంతముగారు.
20. అనితల్లి కలువచేరుశాసనము.-జయంతి రామయ్యగారు, బి.ఎ., బి.ఎల్.,

